## లోకంపోకడ














## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938—1972]
శుక్రవారం : 17–10–'80
రౌద్రినామ సం. ఆశ్వయుజ శు. అష్టమి
సంపుటము 74 : సంచిక 5
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

పోస్టులో ఏడాది చందా రు. 54-60
ఆరు మాసాల చందా రు. 27-30
విడి ప్రతి వెల ఒక రూపాయి
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

అట్టమీది బొమ్మ :
'పిల్లజమీందార్'లో
నాగేశ్వరరావు, జయసుధ

**కథలు :**



**సీరియల్ కథలు :**



**వ్యాసాలు, శీర్షికలు :**



పైవారమే
దసరా సంచిక!

తాజా వార్తలకు ఆంధ్రపత్రిక దినపత్రిక చదవండి!

# జుట్టుకు సిల్కువంటి మృదుత్వము నిచ్చుటకు నైసర్గిక ఉపాయము...



శుద్ధమైన శీకాయిలోని సహజ లాభకర గుణములు, స్వస్తిక్ శీకాకాయ్ సబ్బులో నింపబడినవి. వాడడానికి అనువైనది. లిక్విడ్ షాంపూ కంటే ఎంతో పొదుపైనది.



దీని పుష్కలమైన, మృదువైన నురగ మీ జుట్టును మెత్తగా, పూర్తిగా శుభ్రపరుస్తుంది. మీ జుట్టును ఆరోగ్యంగా, నిగనిగలాడేలా వుంచుతుంది. తాజా సువాసన నింపి పట్టువంటి మృదుత్వాన్ని ఒసగుతుంది.




## స్వస్తిక్
# శీకాకాయ్ సబ్బు

ఇందులో శీకాయి కలిసి వుంది. భారత స్త్రీల అందమైన జుట్టుకు పారంపర్యమైన రహస్యము.

shilpi dm 25/79 tel




"నీ వాదన నేను ఒప్పుకోను మమ్మీ!" అంది దీప.

"ఎందుకు ఒప్పుకోవమ్మా! మారింది సమాజం అంటావు ఏం మారింది?" అంది వసుంధర నవ్వుతూ.

"ఎందుకు మారలేదు మమ్మీ! మనుషుల వేషభాషలు మారాయి, అలంకరణలో మార్పు లొచ్చాయి. ఎక్కువగా ఆడపిల్ల జీవితంలో చాలా మార్పు వచ్చింది. పూర్వకాలంలో అయితే ఆడపిల్ల అడుగు బయట పెడితే ఎన్నో తప్పు అర్థాలు తీసేవారు. కాని ఈ రోజుల్లో ప్రధాని దగ్గర నుంచి అన్ని పోస్టు లలో ఆడవారు కనిపిస్తారు. ఈ విధంగా చూస్తే ఆ రోజుల కంటే ఇప్పుడు ఆడపిల్ల విషయంలో మనదేశం ఒక అడుగు ముందుకు వేసిందనే చెప్పాలి" అంది దీప ఆవేశంగా.

పసిబిడ్డ మాటలను చూసి నవ్వినట్టు నవ్వింది వసుంధర కూతురి మాటలకు.

"అబ్బ! ఎందుకు నవ్వుతావు మమ్మీ! సరి నువ్వు చెప్పు ఏం మారలేదో" అంది దీప గారంగా.

"చూడు చిట్టితల్లీ! నువ్వు మారింది మారింది అంటున్నావు చూడు ఆ మార్పు ఆడవారి అలంకరణలో, చదువులలో, ఉద్యోగా లలో వచ్చిన మాట నిజమే. కాని మనుషుల భావాలలో మార్పు రాలేదమ్మా! రాదు కూడాను. ఉదాహరణకి ఒక ఆడపిల్ల, ఒక అబ్బాయి కాస్త చనువుగా తిరిగారే అనుకో! నువ్వు మారింది అంటున్న ఈ సమాజం ఏమంటుందో చెప్పు? వాళ్ళిద్దరికి ఏదో వుందని అనుకుంటుంది కాని, ఏదో స్నేహి తులు స్నేహంగా తిరిగారు అనుకుంటారా? ఇంతేనమ్మా! మార్పు వట్టి పై పై విష యాలకే. భావాలు మాత్రం పాతవే" అంది వసుంధర.

"నిజమే మమ్మీ! నేను అంతదూరం ఆలోచించలేదు" అంది దీప సిగ్గుపడి.

"ఇందులో నువ్వు సిగ్గుపడాలిసింది ఏమీ లేదు దీపూ! మీ తరం వాళ్ళ ఆలోచనలే ఇవి, నిజం తెలుసుకోవడానికి ప్రయత్నించరు" అంది వసుంధర.

ఇద్దరూ ఆలోచనలలో పడిపోయారు.

"అక్కా!" అంటూ వచ్చింది రాధ. వాళ్ళిద్దరు ఆలోచనలలో వుండటంతో "మమ్మీ! మళ్ళీ అక్కయ్య నీతో వాదనకి దిగిందా? చాలా సీరియస్‌గా వున్నారు ఇద్దరు" అంది నవ్వుతూ.

"లేదులే, ఎందుకు పిలిచావు" అంది దీప.

"ఏంలేదు, ఈ రోజు ఆదివారం కదా! అరుణ వాళ్ళింటికి వెళదాం అని" అంది.

"ఓయస్. అలాగే. మమ్మీ! మేము వెళ్ళి వస్తాం" అంది దీప రాధతో బయటికి నడుస్తూ.

'పిచ్చితల్లి' అనుకుంటూ వంట పనిలో మునిగిపోయింది వసుంధర.

* * *

"దీపా !"

ఉలిక్కిపడింది దీప. అది తన స్నేహితురాలు సుస్మిత గొంతు. నిజంగా గతం ఎంత తీయగా వుంటుంది ? అందుకే అది గతం. ఏ విషయాన్ని అయినా ఎంత బాగా చెప్పేది అమ్మ ! కాని ఈరోజు అమ్మ ఏది ? జారుతున్న కన్నీళ్లను తుడుచుకుని తలుపు తీసింది.

లోపలకు వచ్చిన సుస్మిత ఎర్రబడిన దీప కళ్లను చూసి, "ఓహో ! తమరు చేస్తున్న పని ఇదన్నమాట. సెలవులే కదా ! ఎందుకు రాలేదు దీప అనుకుంటున్నాను నేను. అయినా దీపూ ! గతం ఎన్నిమార్లు తిరగేసినా అది తిరిగిరాదే. అదెప్పుడూ తిరిగిరాదు. ఒంటరిగా నువ్వు ఇలాగే బాధపడుతూ వుంటే నిజంగా నేను ఒక మరిది గారిని వెతుకుతాను" అంది సుస్మిత నవ్వబోతూ.

"చాల్లే, నలభయ్యేళ్ళ ముసలమ్మకి పెళ్ళిట. నవ్విపోతారు ఎవరన్నా వింటే" అంది దీప కోపంగా.

"నవ్వటం ఎందుకు. విదేశాల్లో అయితే ఇదే పెళ్ళి వయస్సు తెలుసా !"

"అవునవునూ! అది విదేశాల్లో కాని ఇది పవిత్రమైన భారతదేశం తెలుసా!" అంటూ నవ్వి, "పోనిలే అన్నట్లు అన్నయ్యలు, రాధ, చంద్రం, శోభల దగ్గిర నుంచి వుత్తరాలు వచ్చాయి సెలవులకి రమ్మంటూ..."

"చంద్రం-అంటే అతనే కదూ! మీ బావ, నీవిలా వుండి పోవటానికి కారకుడు" అంది.

"పోనీలేవే! అది అతని తప్పు కాదుగా, పరిస్థితులు అలా వచ్చాయి. అయినా అది నా రాత."

"అవును. నువ్వు ఇంత వెమ్మదిగా వుంటావు కనుకే అందరు నిన్ను మోసం చేస్తారు. స్కూల్లోను అంతే, టీచర్స్ ఏమన్నా అంటే నోరు మెదపవు. నీ అలుసు చూసుకుని అందరు నిన్ను ఇలాగే ఆడిస్తారు."

"నా స్వభావం అదే సుస్మీ! నేనేం చెయ్యను చెప్పు ? నాకిది కావాలి అని అడిగే ధైర్యం ఎప్పుడూ లేదు. నా మనస్సు తెలుసుకుని ఎదుటి వాళ్లు చేస్తేనే తప్ప నాకై నేను ఎప్పుడు అడగను అది కావాలి అని. సరే, అవి అన్ని వదిలేయ్! కవితని ఎందుకు తీసుకురాలేదు ? బావగారు లేరా ?"




"ఏమన్నా అంటే నా నోరు మూయించటం నీకు అలవాటేగా! ఒంటరిగా ఎన్నాళ్ళు ఇలా వుంటావు ? ఈ వయస్సులో ఏమన్నా అయినా ఎవరు చూస్తారు ? అమ్మ, నాన్న ఎలాగు లేరు. అన్నయ్య, చెల్లి అంటావా ? ఎవరి సంసారాలు వాళ్లవి. నువ్వా ఎవరిమాట వినవు" అంది బాధగా.

"అవి వదిలెయ్యమన్నానా నిన్ను? కవితను ఎందుకు తీసుకురాలేదు చెప్పు."

"మీ బావగారితో పేకాడుతూ కూర్చుంది అది. నువ్వువస్తేకాని అది రాదుట. బాబోయ్ అప్పుడే నాలుగయింది. నా ముఖానకాస్త కాఫీ పోసావంటె వెళతాను."

కాఫీ తాగేసి, "ఇక వెళతాను దీపా! నువ్వు రా ఒకసారి మా యింటికి. కవిత కూడా అడుగుతోంది దీపాంటి ఎందుకు రావటంలేదు మమ్మీ! అని" అంది వెళుతూ.

తలుపువేసి వచ్చి కుర్చీ కిటికి దగ్గరికి జరుపుకుని కూర్చుంది దీప. ఎదురుగా రోడ్డు కిరుపక్కలకు అన్నీ మోదుగపూల చెట్లు. అబ్బ! నిజంగా ఎంత అందంగ వుంటాయో! అగ్నిలా మెరుస్తూ పవిత్రంగా కనిపిస్తాయి. అందుకే వీటిని అగ్నిపూలు అని కూడా అంటారు.

ఈ పూలంటె నాకు, చంద్రం బావకు కూడా చాలా ఇష్టం. నిజంగా ఈ లోకంలో అందరికంటె ఎక్కువగా ఎవరిని ప్రేమిస్తుంది దీప అని అడిగితే నిస్సందేహంగా చంద్రం బావ అని చెపుతుంది. అవి అన్ని తీయని జ్ఞాపకాలు. నిజంగా తను మొండిగా జీవిస్తుంది అంటె ఆ జ్ఞాపకాలతోనే. ఆ రోజుల్లో దీప అంటే అల్లరి, చలాకి పిల్ల అనేవారు అందరు. ఈ రోజు? మళ్ళీ ఆమె మనస్సు గతంలోకి జారిపోయింది.

* * *

"దీపా !"

"వస్తున్నాను మమ్మీ!" అంటూ వచ్చింది దీప. వెనకే రాధ వచ్చింది.

"బావ ఉత్తరం రాసాడు తీసుకో" అంది వసుంధర నవ్వుతూ.

"ఎవరు, చంద్రం బావేనా రాసింది? దాని ముఖంచూడవే! పున్నమినాటి చంద్రుడిలా!" అంది రాధ దీపను వెక్కిరిస్తూ.

"నిజం రాధ ! నువు చూడు మమ్మీ ! దాని ముఖం ఎలా వెలిగిపోతోందో" అన్నాడు అక్కడే కూర్చున్న శ్రీకాంత్.

"నీ ముఖం మాత్రం కాదేమిటి? కల్పన వుత్తరం రాస్తే? చూడు మమ్మీ! వాళ్ళు" అంటూ తన గదిలోకి పారిపోయి వుత్తరం విప్పింది.

డియర్ లవ్ !

నువ్వు వుత్తరాలు రాయటం ఎందుకు మానుకున్నావు ? అలిగావా ? పోనీ పాట పాడనా ! అలిగితివా సఖీ అని. పాట పాడదామన్నా నువ్వు నా దగ్గరగా లేవు. అందుకే నా టేబుల్ మీదవున్న నీ ఫోటోను అడిగాను, వుత్తరాలు క్రమంగా వ్రాయమని. నువ్వు సరే నన్నావు.

ఈ సంవత్సరంతో నీ బి. యె. కూడా అయిపోతుంది. ఇన్నాళ్ళు బి. యె. అవనీ అంటూ ఆపేసావు. ఇప్పుడు అవి కూడ అయిపోయాయి. ఇంకెన్నాళ్లు ఇక్కడ ఒంటరిగా వుండాలి నేను ? అత్తయ్యా వాళ్లతో చెప్పి త్వరగా ముహూర్తం పెట్టించేయ్. ఆ మూడు ముళ్లు వేసేసి నిన్ను

# మోదుగపూలు

ఇక్కడికి లాక్కువస్తాను. ఇక్కడ అమావాస్య చీకట్లో బిర్లా మందిర్ ఎంత అందంగా వుంటుందో తెలుసా ? నువ్వు నా పక్కనే వుంటే ఆ ఆనందాన్ని ఇద్దరం పంచుకో వచ్చు. నీ అందమైన ముఖం, గులాబి రేకుల్లాంటి నీ పెదవులు ఎప్పుడు గుర్తుకు వస్తాయి. వూహల్లోనే నీ బుగ్గలను, నీ పెదవులను ముద్దులతో ముంచేస్తాను. అంత కంటె ఏం చేయాలి! నీ పని చూడు ఆ మూడు ముళ్లు వేసి అసలు వడ్డీతో కలిపి వసూలు చేస్తాను. దీపూ! నాకు నీ ఒడిలో పడుకుని నీ కళ్లలోకి చూస్తూ నువ్వు చెప్పే కబుర్లు వినాలని కోరిగ్గా వుంది. నువ్వేమొ నన్ను మర్చిపోయి హాయిగా వున్నావు.

శ్రీకాంత్ బావను, శ్రీధర్ బావను, కాంతిని, రాధిని, లక్ష్మి అక్కయ్యను, శాంతి అక్కయ్యను, అడిగినట్టు చెప్పు. అత్తయ్యకి మామయ్యకి నమస్కారాలు. పిల్లలకి నా ఆశీస్సులు. మరి నీకు ? నీ చిన్ని పెదవులకు నా తీయ తీయని ముద్దులు.

ప్రేమతో నీ బావ.

వుత్తరం ముగించేసరికి దీప బుగ్గలు సిగ్గుతో ఎ ర్ర బ డి నా యి. 'పిచ్చి బావ' అనుకుంటూ సున్నితంగా వుత్తరాన్ని ముద్దు పెట్టుకుంది.

ఆ రోజు రాత్రే దీప చంద్రానికి ఉత్తరం రాసింది.

బావా !

నీ వుత్తరం అందింది. వెంటనే జవాబు వ్రాస్తున్నాను. నిజం చెప్పాలంటే నీ వుత్తరం చదివి 'పిచ్చి బావ' అనుకుని నవ్వుకున్నాను. వుత్తరంలో నిన్ను మర్చిపోయానంటూ నా మీద నిందలు వేస్తూ నిష్ఠూరంగా రాసావు! నేను నిన్ను ఎలా మర్చిపోగలుగుతాను? నీ వూహలతోనే వూపిరి పోసుకుంటూ నిన్నే తలచుకుంటూ వుండే నేను నిన్నే మర్చిపోయానని నువు అనుకుంటే నువ్వు నీ లవ్‌ని సరిగ్గా అర్థం చేసుకోలేదంటాను.

బావా! నువ్వంటే నా కెంత ప్రాణమో నీకు తెలును. నీకేమయినా అయిందంటే మొదట నా ప్రాణం పోతుందని కూడా నీకు తెలుసు. ఆ రోజు నీకు గుర్తుందనుకుంటాను. నేను నిమ్మలూరుకి వచ్చినప్పుడు నాకు మోదుగ పూలంటే ఇష్టమని ఎర్రటి

[illegible] పూలు తెచ్చి ఇచ్చి తలనొప్పితో పడుకున్నావు నువ్వు. అమ్మ కోప్పడింది నిన్ను ఎండలో పంపినందుకు. నీకు అమృతాంజనం రాస్తూ ఏడ్చాను. నువు కోప్పడ్డావు ఇప్పుడేమయిందని. ఇంకో రోజు నీకు బాగా జ్వరం వచ్చింది. రాత్రి, పగలు అన్నం, నీళ్ళు మానేసి నీ దగ్గరే కూర్చున్నా దాన్ని. మధు బావ, కల్పన, శిరీష్ వెక్కిరించేవారు. నువు పత్యం తిన్న మరునాడే నేను విజయవాడ వచ్చేసాను సెలవులు లేవని. అసలు జ్వరం వచ్చింది నీకా, చంద్రంకా అంటూ అన్నయ్యలూ, వదినలూ రాధి వెక్కిరించారు. వచ్చానే కాని నా మనసు అంతా నీ చుట్టే తిరిగేది. యాంత్రికంగా కాలేజీకి వెళుతున్నాను కాని నా మనస్సు నీ కోసం కలవరించేది. ఇదంతా ఎందుకు రాస్తున్నా నంటే నువ్వు లేకపోతే దీప కూడా లేదు బావా! అంతే.

హైదరాబాద్ విశేషాలు ఏమిటి బావా! ని ఆరోగ్యం జాగ్రత్త! వేళకి భోజనం చేసెయ్. ఆఫీస్ గొడవల్లో పడి ఆకలిని కూడా మర్చిపోతావు నువ్వు. టైమ్ ఎంతో తెలుసా ఇప్పుడు రాత్రి పదిన్నర కావస్తోంది. బయట ఎక్కడో రికార్డ్ వేస్తున్నారు. మన ఇద్దరికి చాల ఇష్టమైన పాట, "హమ్ ప్యార్ మె జిల్‌నే వాలోంకో" వస్తోంది. అది వింటూ రాస్తున్నాను. ఏయ్! వూహల్లోనే నన్ను ముద్దులతో ముంచేస్తున్నాను అంటూ రాసావు. నీ పెదవులు మోటు బాబూ! నా బుగ్గలు, పెదవులు నలిగిపోతాయి. ఇంకేం వ్రాయను. ఇక్కడ అందరూ నిన్ను అడిగి నట్లు చెప్పమన్నారు. మరి వుంటాను. నీకేం ఇవ్వాలి? నా దగ్గరున్నదంతా నీదే.

నీ లవ్.

ఉత్తరం పూర్తిచేసి బద్ధకంగా పక్కపై వాలింది దీప, రేపుపోస్ట్ చేయాలి అనుకుంటూ.

* * *

రోజులు గడుస్తున్నాయి. కాలం ఎవరి కోసం ఆగక జీవితాలలో మార్పులు తెస్తూ పరుగులు తీస్తూనే వుంది. మనిషి ఎన్ని ఎదురుదెబ్బలు తిన్నా రేపులో కొండంత ఆశతో జీవిస్తాడు. మానవ సహజం అది. కాని దీపకి రేపులో ఏమి మిగలక, కట్టుకున్న బంగారు కలలన్నీ కూలతోసింది ఆ రోజు చంద్రం దగ్గిర నుంచి వచ్చిన వుత్తరం. అందులో—

దీపకి!

ఆశీస్సులు. నా వుత్తరం మొదటి నుంచి చివరివరకు చదివి నన్ను అర్థం చేసుకోవటానికి ప్రయత్నించు.

మా ఆఫీసులో శోభ అనే టైపిస్ట్ వుంది. తనకి వెనక, ముందు ఎవరు లేరు ఈ రోజో, రేపో అన్నట్లుండే తండ్రి తప్ప. ఆ అమ్మాయి మన ఆంధ్ర అమ్మాయే. వాళ్లది బందరు. చాలా భయపడుతుంది. అసలెవరితో మాట్లాడేది కాదు ఆ అమ్మాయి. మనప్రైడు అమ్మాయే కదా అని అప్పుడప్పుడు పలకరించే



# మోదుగపూలు

వాడిని. రోజులు గడుస్తుంటే శోభకి నా దగ్గర జంకుపోయి చనువేర్పడింది.

ఆ రోజు వుదయం శోభ ఆఫీస్‌కి రాలేదు. మా గుమాస్తా నడిగాను ఎందుకు రాలేదని. అతను చెప్పాడు వాళ్ల నాన్నగారు పోయారని. నాకు చాలా బాధ అనిపించి వాళ్లింటికి వెళ్లాను. (అంతకు ముందు కూడ ఒకటి రెండు మార్లు వెళ్లాను వాళ్లింటికి) శవం పైన పడి వెక్కి వెక్కి ఏడుస్తూంది శోభ. చుట్టుపక్కల వాళ్లు మాట్లాడుకుంటు న్నారు, శవదహనం ఎవరు చెయ్యాలని. నాకు పరిస్థితి అంతా అర్థం అయింది. శవ దహనానికి నేను తయారయ్యాను. శాస్త్రోక్తంగా అతని కర్మకాండలన్నీ ముగించేసాను. శోభ వంటరిగా మిగిలిపోయింది. చుట్టుపక్కల మగవాళ్ల వెకిలి చేష్టలు, అసహ్యకరమైన మాటలు వింటూ కుమిలిపోయేది. చివరికి ఆఫీసులో కూడా చాలా అసహ్యంగా ప్రవర్తించే వారు ఆమెతో. ఇంటికి వెళ్లాలంటే భయపడేది. చివరికి ధైర్యం చేసి ఆమెను నా దగ్గరకి తెచ్చేసుకున్నాను. కాని యవ్వనంలో వున్న ఒకస్త్రీ, పురుషులు ఒంటరిగా వుండి పవిత్రంగా వున్నారంటే ఎవరూ నమ్మరు. నేను ఎంతో ఆలోచించి శోభనుపెళ్లి చేసుకోవాలని నిర్ణయించుకున్నాను. అలా ఆలోచించే ముందు నువ్వు పదే పదే నాకళ్లలో తిరిగేదానివి. మనస్సు గట్టి చేసేసుకుని శోభను చేసుకుని హైదరాబాద్‌లో రిజైన్ చేసి నిమ్మలూరుకు వచ్చాను. అందరు హతాశులైపోయారు. "దాన్ని అప్పుడే మర్చిపొయ్యావా చందూ!" అని కుమిలిపోయేఅమ్మకు నామౌనమే సమాధానం. కల్పన నాతో మాట్లాడటం మానేసింది. శోభ ముఖం అయితే చూడనే చూడదు.

దీపూ! నన్ను క్షమించు. నిన్ను క్షమించమని అడిగే అర్హత కూడా లేదు నాకు. కాని నీ మనస్సు చాలా నిర్మలమైంది దీపూ! నన్ను అర్థం చేసుకోవడానికి ప్రయత్నించు. నిన్ను ప్రాణానికి ప్రాణంగా ప్రేమించే అమ్మ నాన్నలు, అన్నయ్యలు, వదినలు, చెల్లి అందరు వున్నారు. నీ స్వభావాన్ని చూసి నిన్ను చేసుకోవటానికి మంచి మంచి వాళ్లు వస్తారు. కాని... కాని శోభకి ఎవరు లేరు దీపూ! వంటరి ఆడది ఈ సమాజంలో బ్రతుకలేదు. అందుకే నేను తనకి అండగా నిలిచాను. దీపూ! అమ్మ అన్నట్లు నువు దీపానివి. ఆ దీపం ఎవరింట వెలుగుతుందో వాళ్లే చాలా అదృష్టవంతులు. మళ్లీ మళ్లీ అడుగుతున్నాను దీపూ! నన్ను క్షమించమని. నా దీప మనస్సు నాకు బాగా తెలుసు. నన్ను అర్థం చేసుకుంటుంది. అమ్మ సత్యనారాయణ వ్రతం చేయిస్తూంది. మీకు ఉత్తరం రాస్తుంది రమ్మని. చిన్నదానివైనా నిన్ను చేతులు జోడించి అడుగుతున్నాను ఒక్కసారి రావూ? నాకు నిన్ను చూడాలని చాలా కోరికగా వుంది. నువు నా దానివి కానంత మాత్రంతో పరాయి దానివి కాదు. నాచిన్నారి మరదలివి, చిన్ననాటి స్నేహితురాలివి. నాపై కోపం తెచ్చుకోక నన్ను అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తావని ఆశిస్తున్నాను. నీరాక కోసం వేయి కళ్లతో ఎదురు చూస్తాను. నీ కేమివ్వను దీపూ! నీ కివ్వడానికి నా దగ్గ రేమీ మిగల్లేదు.

నీ వాడు కాని
బావ.

దీపకి లోకం అంతా అంధకారంగా కనిపించసాగింది. ఎందుకిలా అయింది? ఏమిటి నాలో లోపం? నేనేం తప్పు చేసాను? పంచ ప్రాణాలు నీమీద పెట్టుకున్న నామీద ఎందుకు కోపం వచ్చింది? వుత్తరాలు సరిగ్గా రాయలేదనా? దానికి సంజాయిషీకూడ ఇచ్చుకున్నాను. నేను తప్పు చేస్తే నన్ను గట్టిగా కసిరి అడిగే వాడివి. అలాంటి నువ్వు ఏ తప్పు చేయని నాకు ఇంత పెద్ద శిక్ష ఎందుకు వేసావు? కుమిలి కుమిలి ఏడుస్తూంది దీప.

"దీపూ!" అంటూ లోపలికి వచ్చింది వసుంధర.

"మమ్మీ!" అంటూ ఆమెను చుట్టుకు పోయి బావురు మంది.

"దీపూ! ఈ క్షణంలోనే నువ్వు ధైర్యం తెచ్చుకోవాలి. చూడు నీ రాతలో బావ రాసి లేదు. అంతే! అన్నయ్యలు, వదినలు, చెల్లి, నాన్నగారు చాలా బాధపడుతున్నారు జరిగిన సంగతి విని. జరిగిపోయిన దానిని తలచుకుని బాధ పడేకన్నా జరిగేదానిని గురించి ఆలోచించాలి."

"కానిమమ్మీ! ఇది జీవితం. కథ కాదు త్వరగా మర్చిపోవటానికి. ఇప్పుడు నేనెలా బ్రతకాలి బావ లేకుండా" అంది జాలిగా ఏడుస్తూ.

బి. యె. చదివిన తన కూతురు మరీ అంత బేలగా ఏడుస్తుంటే, జారుతున్న కన్నీళ్లను బలవంతంగా ఆపుకుని ఆమెను గుండెల్లోకి తీసుకుంది వసుంధర.

* * *

ఆ వారంలోనే వసుంధర, భవానిప్రసాద్, దీప, రాధ, శాంతి, లక్ష్మి, శ్రీకాంత్ నిమ్మలూరుకి వెళ్లినారు.

ఇంట్లోకి అడుగు పెట్టిన అన్నగారి

# మోదుగపూలు

కుటుంబాన్ని చూచి చాలా సంతోషపడి పోయింది రాజేశ్వరమ్మ.

ఏమిజరగనట్లు తనతో ఎప్పటిలాగా ఆప్యాయతతో మాట్లాడుతున్న అత్తయ్య, మామయ్యను చూసి ఆశ్చర్యపడి వారి సహృదయతకు మౌనంగా మనస్సులోనే నమస్కరించాడు చంద్రం.

మరునాడే వ్రతం. దీప తన పుట్టిన రోజున చంద్రం ఇచ్చిన పచ్చల దుద్దులు, వుంగరం పెళ్లి కట్నంగా శోభకు ఇచ్చేసింది. పూజ దగ్గర కూర్చున్న శోభకు ఆడవాళ్ల గుసగుసలు స్పష్టంగా వినిపిస్తున్నాయి.

"అసలు చంద్రం మేనమరదలిని చేసుకుంటాడనుకున్నాం కాని ఇదేమిటి? అయినా ఈ పిల్ల ఏం బాగుంది? దీప అయితే చిదిమి దీపం పెట్టుకోవచ్చు" అంది కరణంగారి సతీమణి.

"అది అంతే వదినా! హైదరాబాద్‌లో వుద్యోగం వెలగపెట్టాడుగా? ఏదో జరిగి వుంటుంది. అందుకే గుట్టుచప్పుడుకాకుండా చేసుకుని వెంటపెట్టుకొచ్చాడు" అంది మునసబుగారి శ్రీమతి.

"కలికాలం వదినా! ఆడపిల్ల బరితెగించితే మగాడు ఏం చేయగలడు? బావా మరదళ్లు చిలకా గోరింకల్లా వుండేవారు దీపంటే చంద్రంకి ఎంత ప్రాణమో మనకి తెలీదూ? ఇది అతగాడికి ఏదో పెట్టి వుంటుంది. అందుకే ఇలా జరిగింది. పాపం! దీప ముఖం చూస్తే గుండె తరుక్కుపోతూంది. అయినా మనకెందుకీ గొడవ" అంది కరణంగారి భార్యారత్నం.

అన్నీ విన్న శోభ ముఖం పాలిపోయింది. ఏమిటి! వారు దీపను ప్రేమించారా? పెళ్లి చేసుకోవాలనుకున్నారా? నాతో ఒక్క మాట అయినా అనలేదే? దీప! నిజంగా దీప ఎంత అందంగా ఉంటుంది? ఆ పిల్ల అందం ముందు తనెంత? ప్రాణం కన్నా ఎక్కువగా ప్రేమించిన దీపను నా కోసం ఆయన త్యాగం చేసారా? దీప కూడా ఎంత మంచిది! అన్నీ మరచిపోయి తనతో ఎంత బాగా మాట్లాడుతూంది. వీళ్లు అసలు మనుషులు కారు. మనుషుల్లో వెలసిన దేవతలు. ఈ పరిస్థితుల్లో ఆయన నన్ను వదిలేస్తే నాగతి? అమ్మో! వూహకే భయం వేసే పరిస్థితులు. ఏది ఏమైనా ఆయనకు అనుగుణంగా నడుచుకోవడం తన ధర్మం, విధి కూడాను అనుకుంది శోభ.

*　　*　　*

మరునాడు సాయంకాలం ఆ వూరి పక్కనే వున్న నదిఒడ్డున వున్న శివాలయంకు వెళ్లింది దీప. ఆ శివాలయం దీపకి, చంద్రంకి ఇష్టమైన స్థలం. బయట అరుగుపై కూర్చుని గలగల పారే నదిని పచ్చని ప్రకృతిని చూడటం అంటే ఆ ఇద్దరికి కూడా చాలా ఇష్టం. వీళ్లిద్దరికి ప్రసాదం పెడూ, శీఘ్రమేవ కల్యాణ ప్రాప్తిరస్తు అని దీవించేవాడు ఆ గుడి పూజారి. చిలిపిగా, అల్లరిగా లోకంలో వున్న ఆనందం అంతా తమదే అన్నట్లు తిరిగే ఆ జంటను చూసి ముచ్చట పడేవారు ఆ పూజారి తాతయ్య.

ఒంటరిగా ప్రసాదం కోసం చేతులు చాపిన దీపను చూచి, జారబోతున్న కన్నీళ్లను అదిమేసి ఆమె చేతులలో ప్రసాదం పెట్టి అలవాటుగా "శీఘ్రమేవ కల్యాణ ప్రాప్తిరస్తు" అన్నారు పూజారి తాతయ్య.

"వద్దు తాతయ్యా! నన్ను అలా దీవించకు, నే నెవరిని చేసుకోను. అసలు నాకు పెళ్లే వద్దు తాతయ్యా!" అంటూ బావురుమంది దీప.

"అలా అనకూడదమ్మా! నువ్వింకా చిన్నపిల్లవి. ముందు అనుభవించ వలసిన జీవితం ఎంతో మిగిలి వుంది."

## నా మనసు రైలైతే బాగుండు

నా
మనసు రైలైతే బాగుండు
దిగే ప్రయాణీకుల్ని
ఎప్పటికప్పుడు మర్చిపోతూ
ఎక్కేవాళ్లతో
నిశ్చింతగా సాగిపోతుంది రైలు.
నా
మనసట్లా కాదు —
గతంలోని బాధల బొమ్మల్ని
పదే పదే కళ్లముందుంచుతుంది.
అందుకే—
నా
మనసు రైలైతే బాగుండు.

— వెంపలి వెంకట శివప్రసాద్

"లేదు తాతయ్యా ! నాకేమి మిగల్లేదు. అంతా అయిపోయింది. ఏం చూసుకుని బ్రతకనూ ?"

"చూడు తల్లీ! పాలల్లో చిన్న గరిక పడిందని పాలన్నీ పారేసుకుంటామా ? ఆ గరికను తీసి పారేసి శుభ్రం చేసుకుని వాడు కోవటంలేదూ ? అలాగే! మనం ఎన్నో అను కుంటామమ్మా ! అన్నీ మనం అనుకున్నట్లు జరిగితే భగవంతుడు ఎందుకు ? అనుకున్నవి కానివ్వక, అనుకోనివి చేస్తూ నేను వున్నాను అంటూ గుర్తు చేస్తాడమ్మా! భగవంతుడు. అన్నీ మనం అనుకున్నట్టు జరగకపోవచ్చు, అంత మాత్రం చేత జీవితంపై విరక్తి చెందకూడదు. చిరునవ్వుతో వాటిని స్వీకరించి ముందంజ వేయాలి. ఇంతకంటె నీకేం చెప్ప గలడీ ముసలి తాతయ్య? చదువుకున్న దానివి, ప్రాజ్ఞురాలివి నన్ను అర్థం చేసు కుంటా వనుకుంటానమ్మా !"

కొద్ది క్షణాలు మౌనంగా గడిచిపోయాయి. సంధ్యాదేవి తన నల్లని ముసుగు ధరించి ముస్తాబు అవుతూంది. ఒక నిశ్చయానికి వచ్చిన దానిలా కళ్ళు తుడిచేసుకుని, "అవును తాతయ్యా! తాళి కట్టనంతలో బావ నాకు పరాయివాడు కాదుగా! నేను బ్రతుకుతాను తాతయ్యా! నన్ను అల్లారు ముద్దుగా పెంచిన అమ్మ నాన్నల కోసం, నా కాలికి చిన్న దెబ్బ తగిలినా సహించలేని అన్నయ్యలు, వదినల కోసం, నా చిన్నారి చెల్లి కోసం, తప్పక బ్రతుకుతాను. కాని నాకు పెళ్లి చేసు కోవాలని లేదు" అంది దీప.

"అదేమిటమ్మా! కోరికలు చంపుకుని విరాగినిలా ఎన్నాళ్ళు బ్రతుకుతావు? అల్లారు ముద్దుగా పెంచిన అమ్మ నాన్నలు నీ జీవి తాంతం తోడుంటారా? ఎంతో అపురూపంగా చూసిన అన్నయ్యలైనా ఎన్నాళ్ళు చూస్తా రంటావు ! ఎవరి జీవితం వారిది. అయినా అలా అనుకోవటం తప్పకూడా. నీ జీవితాన్ని ఎవరో వచ్చి చక్కదిద్దుతారను కోవటం పొరపాటు. నీ జీవితం నువ్వు చక్కదిద్దు కోవాలి" అన్నారు నవ్వబోతూ.

"లేదు తాతయ్యా! నేను ఎవరిపై ఆధారపడను. నా బ్రతుకు నాదే. ఇక పెళ్లి అంటారా! జీవితంలో ఎప్పుడైనా పెళ్లి కావాలి అనిపిస్తే తప్పక చేసుకుంటాను. నా పెళ్లికి మొట్టమొదటి అతిథివి కూడా నువ్వే తాతయ్యా! మరిక వెళ్లి వస్తాను తాతయ్యా! చీకటి పడింది. అమ్మ వాళ్లు గాభరా పడ తారు" అంటూ వెళ్లిపోయింది దీప.



"పిచ్చితల్లీ! నీ మనస్సు వెన్నలాటిదమ్మా! నీకు శుభం కలగాలని ఆ సర్వేశ్వరుడిని మన సారా ప్రార్థిస్తాను" అనుకుంటూ లోపలికి వెళ్లిపోయారు పూజారి తాత.

అంతక్రితమే అక్కడికి దీపను వెతుక్కుంటూ వచ్చిన చంద్రం, అప్ర యత్నంగా వాళ్ల సంభాషణ విని జారుతున్న కన్నీటిని తుడుచుకుని నిశ్శబ్దంగా వెళ్లి పోయిన సంగతి వీరిద్దరికీ తెలియదు.

* * *

ఆ వారం రోజులు నిముషాల్లా గడిచి పోయాయి అందరికి. అల్లరిగా, అందరిని నవ్విస్తూ మామూలుగాతిరుగుతున్నకూతురిని చూసి వసుంధర, భవాని ప్రసాద్‌ల మనస్సులు తేలికయ్యాయి. కాని వంటరిగా రాత్రిళ్లు మల్లెపందిరి దగ్గర కూర్చుని కుమిలిపోయేది దీప. ఆ సంగతి ఒక్క చంద్రంకు తప్ప ఎవరికి తెలియదు. తెలిసి తను చేయగలిగింది ఏమీలేదు.

వారం తరువాత తిరుగు ప్రయాణ మయ్యారు అందరూ.

* * *

కాలగర్భంలో ఇరవయి ఏళ్లు గడిచి పోయాయి. ఈ మధ్య కాలంలో ఎన్నో మార్పులు. శ్రీకాంత్, రాధికల పెళ్లిళ్లు, దీప బి. యే. బి. యిడి అవడం, వసుంధరా, భవాని ప్రసాద్‌లు, రాజేశ్వరమ్మ దంపతులు కాలగర్భంలో కలిసిపోవటం, స్వల్పకాలంలోనే జరిగిపోయాయి. ఎవరెన్ని విధాలుగా చెప్పినా వినక విరాగినిలా, ఒంటరిగా మిగిలిపోయిన దీపను చూసి, దిగులుతో అసంతృప్తిగా కన్ను మూసారు రెండు రోజుల తేడాతో వసుంధర, భవాని ప్రసాద్‌లు. దీపను ఒకింటి దానిగా చూడకుండానే కన్ను మూసారు పూజారి తాతయ్య.

దీపకి నిజామాబాద్ కాన్వెంట్ స్కూల్లో వుద్యోగం దొరికి అక్కడికి వెళ్లిపోయింది. మొదటిసారిగా స్కూల్లో అడుగు పెట్టిన దీపకి అక్కడి వాతావరణం భయం కలిగిం చింది. కాని అదేస్కూల్లో తెలుగు టీచర్ సుస్మిత ఆమె భయాన్ని పోగొట్టి, దగ్గిర యింది. పసిపిల్లల మధ్య గతాన్ని చాలావరకు మరిచిపోయినా చంద్రం, శోభల వుత్తరాలు గుర్తు చేస్తాయి.

గోడ గడియారం వరసగా ఏడు గంటలు కొట్టింది. సుదీర్ఘమైన గతంలోంచి బయట పడింది దీప. కిటికీలోంచి వెన్నెల లోపల పడుతూంది. అగ్నిపూలు (మోదుగ పూలు) వింతగా కనిపిస్తున్నాయి. అందంగా కనిపించే ఆ పూలు తనకెంతో ఇష్టం. ఎంత అందంగా కనిపించినా, అగ్నిలా మెరుస్తున్న ఆ పూలు పూజకి కాని, తల్లో పెట్టుకోవ టానికిగాని పనికిరావు. తన జీవితం అంతే! అందరికి అందంగా కనిపించినా ఒంటరిగా, ఎందుకు పనికి రాకుండా మిగిలిపోయింది. ఆ పువ్వు వున్నన్నాళ్లు అందంగా మెరుస్తూ వుంటుంది చెట్టుపై. తరవాత వాడిపోయి రాలిపోతుంది. తనూ అంతే! ఆ పూలకి, తన జీవితానికి ఎన్నో పోలికలు కనిపిస్తాయి. నేనూ ఒక మోదుగ పువ్వునే ! పేలవంగా నవ్వుకుంటూ లేచింది దీప లైటు వెయ్యటానికి.

# మువ్వల  మురళి

సీరియల్ — ఆర్. సంధ్యాదేవి

**జరిగిన కథ — 12 :** పి. యు. సి. పాసయిన మల్లిఖార్జునరావు చెల్లెలు హరితకు, తెచ్చిన ఏ సంబంధమూ నచ్చటంలేదు. తన పెద్ద మామయ్య శంకరంగారి కూతురు లీల పెళ్ళికి మద్రాస్ వెళ్తుండగా ఆమెకు ట్రైన్‌లో 'కృష్ణసుమంత్'తో పరిచయమేర్పడుతుంది అతని అందాన్ని మనసులో మెచ్చుకొంటుంది. మళ్ళీ అతను లీల పెళ్ళిలో కనబడ్డప్పుడు ఆమె కలవరపడుతుంది. మామయ్య కొడుకయిన కుమార్ భార్య శైలజ కోరంగా ఆమెతో బలభద్రరావుగారింటికి వెళ్తుంది హరిత. విజయమ్మా, బలభద్రరావుగార్ల ఏకైక పుత్రుడే ఈ కృష్ణసుమంత్ అని తెలుసుకుంటుంది హరిత విశాఖపట్నంలో లాయర్‌గా పనిచేస్తున్న కృష్ణసుమంత్‌కి రామనాథం మేష్టారు ద్వారా పరిచయమైన తండ్రిలేని రోజాను, ఆమె తల్లి సీతమ్మను సంరక్షిస్తుంటాడు. తన ఫ్రెండ్ తమ్ముడికి ఉద్యోగం వేయించమని అడగటానికి వస్తాడు మల్లిఖార్జునరావు. అతనికే విషయమూ మరునాడు చెబుతానని చెప్పి, వచ్చేటప్పుడు హరితను కూడా తీసుకురమ్మని వాళ్ళని డిన్నర్‌కి ఆహ్వానిస్తాడు కృష్ణసుమంత్. మల్లిఖార్జునరావు చాకచక్యంగా హరితను డిన్నర్‌కు తీసుకువెళ్తాడు. కృష్ణసుమంత్ ఫ్రెండ్ శాస్త్రి ద్వారా అతని తల్లిదండ్రుల అడ్రస్ కనుకొని, వెళ్ళి హరిత పెండ్లి విషయం మాట్లాడివస్తాడు మల్లిఖార్జునరావు. కృష్ణసుమంత్ తల్లిదండ్రులు వచ్చి, హరితతో అతని పెళ్ళి నిశ్చయం చేసి వెళ్తారు. కృష్ణసుమంత్, హరితల వివాహం అతివైభవంగా జరిగిపోతుంది. కొన్ని కారణాలవల్ల కృష్ణసుమంత్, హరితల మధ్య ఘర్షణలు మొదలౌతాయి. రోజా తల్లి చనిపోగా, ఆమె కర్మకాండలన్నీ కృష్ణసుమంతే జరిపిస్తాడు. రోజా కృష్ణసుమంత్‌ల మధ్య అక్రమ సంబంధం ఉన్నదని ఒకామె ద్వారా తెలుసుకొన్న హరిత, భర్తను నిలదీసి అడుగుతుంది. అతని నుండి ఏ సమాధానం రాకపోయేసరికి, తన అన్నగారు వాళ్ళ వూరినుండి రాగానే వాళ్లదగ్గరకు వెళ్లిపోవడానికి నిశ్చయించుకొంటుంది హరిత. ఈలోగా తను వుంటున్న వీధిలోని వాళ్ళంతా సూటిపోటి మాటలతో కాకుల్లా పొడుస్తుంటే భరించలేక కృష్ణసుమంత్ ఇంటికి వచ్చినరోజాను అతను తన గెస్ట్‌రూంలో వుంచుతాడు. హరిత ఇంటి విషయాలు పట్టించుకోకుండాముభావంగా ఉండటం చూసి కృష్ణసుమంత్, ఆ ఇంటి బాధ్యతలు అన్నీ రోజాకే అప్పగించేస్తాడు. రోజా కృష్ణసుమంత్‌ల చనువును చూసి సహించలేక, తను ఆ ఇంట్లో నుంచి వెళ్లిపోతున్నట్లు ఉత్తరం ద్వారా తెలియజేసి వెళ్ళిపోతుంది హరిత.

(గతసంచిక తరువాయి)

వున్నట్టువుండి అతను వూరు నుండి వూడిపడటం, ఇంట్లో కృష్ణసుమంత్ లేకపోవటం ఆమెకు భయంగా అనిపించింది.

మల్లిఖార్జునరావు పట్టరాని ఆవేశంతో ఒక్కోఅడుగే వేస్తూ, దగ్గరగా రాసాగాడు.

"నిన్ను ప్రాణాలతో వుంచను. నిన్ను చంపేసి రక్తసిక్తమైన చేతులతో స్టేషన్‌కి వెళ్ళి, చేసిన నేరం ఒప్పుకుని అరెస్ట్ అయిపోతాను" అంటూ చుట్టూ చూశాడు, ఏదైనా కత్తి దొరుకుతుందేమోనని. ఆమెను పొడిచి చంపేయాలనుకున్నాడు.

కాని, అతనికి ఏం కనిపించలేదు. దగ్గరగా వెళ్లి రోజా కంఠం పట్టుకున్నాడు.

రోజా భయకంపితురాలై నోట మాట రాక అలాగే నిలబడిపోయింది. అతని చేతులు ఆమె కంఠానికి బిగుసుకున్నాయి.

అంతే! అతని భుజంపై ఎవరిదో బలమైన చెయ్యి పడింది. మల్లిఖార్జునరావు ఉలిక్కిపడి వెను తిరిగి చూసేటప్పటికి, కృష్ణసుమంత్ వెనక నిలబడి అరచేతిని అడ్డంపెట్టి అతని మెడమీద బలంగా కొట్టాడు.

అంతే! మల్లిఖార్జునరావు భరించలేని బాధతో మెలితిరిగి పోతూ, రోజా కంఠం వదిలేసి తన మెడ పట్టుకున్నాడు. కళ్ళు చీకట్లు క్రమ్మేసి అంతా అలికేసినట్లు కనిపించ సాగింది.

కృష్ణసుమంత్ కళ్ళు నిప్పులని వర్షిస్తున్నాయి. క్రోధావేశాలతో అతని షర్టు కాలర్ పుచ్చుకుని ఇవతలకు లాగేడు ఒక గుంజు గుంజుతూ—

"రోజా వంటిమీద చెయ్యి పడిందో జాగ్రత్త!"

"బావగారూ!" అంటూ తన షర్టు పట్టుకున్న అతని చేతిని ఒక్క విదిలింపుతో విదిలించుకుంటూ—

"నా సంగతి ఇంకా మీకు తెలీదు. ఆడపిల్లను ఇచ్చామని ఎంత అణిగి మణిగి వున్నా, మాకూ పంతాలూ పౌర్షాలూ వుంటాయి. మీఈ నాటకాలు అన్నీచూస్తూ చేతకాని వాళ్లలా కూర్చోవడానికి మేము ఏం తక్కువ పరిస్థితుల్లో లేము" అన్నాడు కోపంగా.

ఆ మాటలు వింటూనే కృష్ణసుమంత్ పిడికిళ్ళు బిగుసుకున్నాయి, కోపాన్ని బలవంతంగా అపుకుంటున్నట్టు.

"బావగారూ! నేను మర్యాదగా మీకు చెపుతున్నాను. మీరు మా చెల్లెలిని క్షమార్పణ కోరుకుని ఇంటికి వచ్చి తీసుకువెళ్ళండి.

# గెలవండి తెలుపు యుద్ధం

# బోనస్ బార్ సిద్ధం

కొత్త బోనస్ డిటర్జెంట్ బార్

బోనస్ శక్తిని పరీక్షించి చూడండి.
కొత్త బోనస్ డిటర్జెంట్ బార్. సాటిలేని పొదుపు—
గుర్తింపు గల మరే డిటర్జెంట్ బార్‌తోనైనా సరే దీని
పనితనాన్ని, వెలని పోల్చిచూడండి.
పసుపు, ఆకుపచ్చ రంగుల్లో దొరుకుతుంది
కొత్త బోనస్ డిటర్జెంట్ బార్






టాటావారి తయారీ



ముందు ఈకులటను ఇక్కడ నుండి పంపే యుండి'' అంటూ, ఒక మూలగా నక్కినట్టు భయంగా నిలబడిపోయిన రోజా వైపు చెయ్యి పెట్టి చూపించాడు.

అంతే! కృష్ణసుమంత్ మరి కోపం ఆపుకోలేకపోయాడు. పిడికిలి బిగించి అతని గడ్డంమీద కొట్టాడు. అతను గడ్డం చేత్తో తడుముకుంటూ, ఉక్రోషంగా కృష్ణసుమంత్ వైపు చూశాడు.

"నా యింటికి వచ్చి, నా యింట్లో రోజాని అంటావా! రోజాని వేలుపెట్టి చూపించే అర్హత నీకుందా?'' అతని కేకలకి ఆ బంగళా అంతా గజ గజ లాడినట్టు అయింది.

"రోజా!'' అంటూ హేళనగా నవ్వి, "దాని బ్రతుకు ఏమిటో నాకు తెలీదా! ఈరోజున మీరు, రేపు నేను, ఎల్లుండి మరొక...'' అంటున్న అతని మాటలు పూర్తి కానేలేదు—కృష్ణసుమంత్ ఆపుకోలేని ఆవేశంతో ఉగ్రస్వరూపం దాల్చి, మల్లిఖార్జునరావు షర్ట్ కాలర్ పట్టి ఒక్కగుంజు గుంజి దూరంగా తోసేసాడు. అతను తూలి

## మువ్వల సవ్వడి

వెళ్ళి టేబుల్‌కి కొట్టుకున్నాడు.

"జాగ్రత్త! మళ్ళీ మాటలు మీరితే మర్యాద దక్కదు.''

"ఏం చేస్తారు!'' అంటూ దగ్గరకు రాసాగాడు.

"రంగన్నా! బంగారయ్యా!'' అంటూ నౌకర్లని కేకేశాడు. నౌకర్లు ఇద్దరూ అతని పిలుపుకి పరుగున వచ్చారు.

మల్లిఖార్జునరావు వైపు చూపిస్తూ కళ్లతోనే సైగచేశాడు. వాళ్లు ఆ సైగను అర్థం చేసుకున్నట్టుగా మల్లిఖార్జునరావు చేతులు చెరోవైపు గట్టిగాపట్టుకుని ఆపారు, అతన్ని కదలనివ్వకుండా.

"వీరికి వీధిలోకి దారి తెలియదు అట! తీసుకువెళ్లి చూపించండి'' అంటున్న అతని కంఠంలో హేళన ధ్వనించింది.

"బావగారూ!'' అంటూ కోపంగా అరిచాడు.

"మీరు నా చెల్లెలు మెడలో తాళికట్టిన మూలంగా మర్యాద ఇస్తున్నాను. లేకపోతే మీ ఇద్దరి అంతూ నేను ఈ వేళ చూసి వుండేవాడ్ని'' అన్నాడు మండిపడుతూ.

అతని మాటలకి కృష్ణసుమంత్ నిర్లక్ష్యంగా నవ్వాడు.

మల్లిఖార్జునరావు పొడవుగా వున్నప్పటికీ కృష్ణసుమంత్ దగ్గర బాగా పొట్టి అనే చెప్పాలి. కృష్ణసుమంత్ బలమైన శరీరం ముందు మల్లిఖార్జునరావు శరీరం బక్కపలచగా వుంటుంది. అతనితో కలబడితే మెత్తగా తన్నులు తిని చిత్తుగా ఓడిపోవలసిందే! ఆ సంగతి ఇద్దర్నీ చూస్తేనే ఎవరైనా చెప్పేయగలరు.

కృష్ణసుమంత్ నిర్లక్ష్యంగా నవ్వి, రోజా దగ్గరగా వచ్చి భుజాల చుట్టూ చెయ్యివేసి, మేడమీదకు దారితీశాడు. వాళ్లిద్దరూ మేడ మెట్లు ఎక్కుతుంటే ఆపుకోలేని ఆవేశంతో అరిచాడు—

"రేపే నేను మద్రాసు బయలుదేరి మీ అమ్మా, నాన్నగార్లతో చెప్పి మీ పరువు ప్రతిష్టలని నలుగురిలో పెట్టి కడిగి పారేసి ఈ రోజా అంతు తేలుస్తాను. మిమ్మల్ని లాక్కువెళ్లి నా చెల్లెలు కాళ్ళమీదపడేస్తాను.

మీరు దానికి క్షమార్పణలు చెప్పేందాకా విడిచి పెట్టను'' అంటూ మల్లిఖార్జునరావు పిచ్చెక్కినట్టు అరవసాగాడు.

కృష్ణసుమంత్, రోజా అతని మాటలకి వెనుతిరిగి చూడలేదు. తమని కానట్టే మేడ మీదకు వెళ్లిపోయారు.

## 41

హారిత మంచం మీద తనలో తను ఏడుస్తూ పడుకుంది. తల్లి గోవిందమ్మ, విశాలి ఆమెను వూరుకోబెట్ట సాగారు. హారిత మాటలు మొదట విశాలి నమ్మలేదు. ''అతను అటువంటి వాడు కాదు. ఈ అమ్మాయి అతన్ని అపార్థం చేసుకుని వుంటుంది'' అని అనుకుంది.

రెండు రోజుల క్రితం భర్త వెళ్లి అతనితో ఘర్షణ పడటం అంతా విన్నాక నమ్మక తప్పలేదు. పైకి పెద్దమనుష్యుల్లా వుండే వాళ్ళంతా ఎన్ని నాటకాలు ఆడతారో ఇప్పుడు అర్థం అవుతూంది. మెల్లగా అతను అంటే విశాలికి మంచి అభిప్రాయం తొలగిపోయింది.

గోవిందమ్మ బాధ పడింది. ''చదువు కున్నాడు, అందంగా వున్నాడు అని పిల్లనిచ్చి పెళ్లి చేస్తే దాని గొంతుక కోశాడు'' అనుకుని కన్నీరు కార్చింది, కూతురి బాధ చూడలేక.

హారిత ఆ యింటివద్ద నుండి పారిపోయి స్నేహితురాలి యింటికి వెళ్లి నాలుగురోజులు వుండి 'అన్నయ్యా వాళ్లు ఊరు నుండి వచ్చేశారు' అని తెలిశాక వచ్చింది. రావటంతోనే తల్లినీ, వదినీ, అన్నయ్యనూ పట్టుకుని బావురుమంటూ ఏడ్చేసింది.

హారిత అంటే ఆ యింట్లో అందరికీ గారాబం వలన, ఆమె అలా ఏడ్వగానే అందరి హృదయాలు ద్రవించిపోయాయి. ఆ రోజు 'ఇది నిజమా!' అన్నట్లు, మతులు పోయినట్టు కూర్చున్నారు.

మొండికేసిన మగవాడ్ని గాని, స్త్రీనిగాని ఎవ్వరూ ఏం చెయ్యలేరు. ఇంటికే తీసుకు వచ్చి వుంచాడు అంటే, అతనికి ఎవ్వరన్నా, ఏమాత్రం భయం లేదు. అన్నిటికీ తెగించే అంత సాహసం చేశాడు. పైగా అతను

ధర్మపథం

# గంగా ప్రాశస్త్యం

బులుసు వెంకటరమణయ్య

భారత దేశంలోని నదు లన్నింటిలో గంగా నది మిక్కిలి పవిత్రమైనది. గంగానదీ స్నానం మనస్సున కొక విధమైన ప్రశాంతిని కలిగిస్తుంది. గంగా స్నానం వల్ల పాపాలు నశిస్తాయని మనవారి విశ్వాసం.

గంగానది కొక ప్రత్యేకత ఉన్నది గంగా జలం ఎన్ని రోజులుంచినా చెడిపోదు. దానిని చిన్న చిన్న చెంబులలో పట్టి సీలువేసి, నెలల కొద్దీ, సంవత్సరాలకొద్దీ నిలవచేసుకోవడం పరిపాటి. అయితే– ఇతర నదుల జలం కలియని గంగా జలమే నిల్వ ఉంటుంది. ఇతర నదులు కలిసిన తర్వాత ఆ నీటికి ఈ ప్రత్యేకత ఉండదు. కాశీ, గయ, ప్రయాగ మున్నగు స్థలాలకు యాత్రకు వెళ్లేవారు కాశీలో గంగాజలాన్ని పట్టి ఉంచరు. ప్రయాగలో యమునానది గంగానదిలో కలిసిపోతుంది. కాశీలోని గంగానది యమునానది కలిసినదే! అందువల్ల ప్రయాగలో శుద్ధ గంగాజలాన్నే పాత్రలలో పట్టి ఉంచుతారు. హరిద్వారంవెళ్లేవారు అక్కడి గంగాజలాన్ని భద్రపరుస్తారు.

ఈ గంగా జలానికి ఇట్టి ప్రత్యేకత ఉండడానికి కారణం ఏమిటి?– ప్రశ్న కలుగక పోదు. విష్ణు పురాణంలో దీనికి సమాధానం లభిస్తుంది.

సూర్యుడు తన కిరణాలవల్ల నాల్గు విధాలుగా భూమినుండి జలాన్ని గ్రహించి మేఘాల మూలంగా తిరిగి భూమిపై కురిపిస్తాడు. సముద్రం, నదులు, భూమి, ప్రాణులున్నూ ఆ నాలుగు విధాలు. పై నాలుగు విధాలూ భూమికి చెందినవి. మేఘాల మూలంగా తిరిగి భూమికి జలాన్నిచ్చేవి.

ఈ విధంగా నాల్గు రీతులుగా కాక మరొక విధంగా సూర్యుడు మనకు జలాన్ని ఇస్తున్నాడు. ఆతడు ఆకాశ గంగా జలాన్ని స్వర్గం నుండి తన కిరణాల మూలంగా స్వీకరించి, మేఘాల ప్రమేయం లేకుండా భూమిపైని విడిచిపెడుతున్నాడు. అదే గంగా నదిగా ప్రవహిస్తున్నది. భూమి నుండి గ్రహించబడిన నీరు కాకపోవుటవల్లనే గంగా జలానికి పవిత్రత లభించినది. అనది పాపములను నశింపజేసేది అయింది.

"సరిత్సముద్ర భౌమాస్తు
తథాపః ప్రాణి సంభవాః,
చతుష్ప్రకారా భగవా
నాదత్తే సవితా మునే.
ఆకాశ గంగా సలిలం
తదాదాయ నభస్మాన్,
అన భ్రగతమే వోర్వ్యాం
సద్యః క్షిపతి రశ్మిభిః,
తస్య సంస్పర్శ నిర్ధూత
పాపపంకో ద్విజోత్తమ,
నయాతి నరకం మర్త్య
దివ్యం స్నానం హితత్ స్మృతమ్."

"జలములు, నదులు సముద్రములు, భూప్రదేశములు, ప్రాణులు అను నాలుగు రకముల నుండి గ్రహించబడుచున్నవి. ఈ జలములు సూర్యుని చే గ్రహించబడుచున్నవి. అతడు ఆకాశ గంగాజలమును, కిరణములవల్ల స్వీకరించి భూమిపై – మేఘము లక్కరలేకుండగనే విడుచుచున్నాడు. ఆ గంగా జలమును స్పృశించినంత మాత్రాన మానవుల పాపము నశించును. నరకమునకు పోనక్కరలేదు. గంగా స్నానము దివ్య స్నానము!" అని పయి శ్లోకాల అభిప్రాయం.

---

లాయరు. ఎవ్వర్ని ఏ విధంగానైనా పల్టీ కొట్టించేయగలడు.

మర్నాడు మల్లిఖార్జునరావు కోపంగా వాళ్ల యింటికి వెళ్లి అవమానింపబడి వచ్చాడు. దానితో అంతా కృంగిపోయారు.

"ఏం చెయ్యాలి? ఎవరితో చెప్పాలి? ఎలా ఈ సమస్యని ఎదుర్కొని హరిత జీవితం చక్కదిద్దాలి? హరిత మళ్లీ మునుపటిలా సరదాగా, ఉషారుగా తిరగటం తమ కళ్లతో చూడగలుగుతామా?" అని అంతా విచారించ సాగారు.

వూరునుండివచ్చాక ఎవ్వరూ సంతోషంగా లేరు. ఎవ్వరూ సరిగ్గా కడుపు నిండా భోజనం చెయ్యటంలేదు.

మల్లిఖార్జునరావుకి ఆ వారం రోజులూ ఎంత ప్రయత్నించినా శెలవు దొరకలేదు.

వారం రోజుల తరువాత మెడ్రాస్ వెళ్లి ఈ విషయం అంతా బలభద్రరావుగారికీ, ఆయన భార్యకు చెప్పి వెంటబెట్టుకు వచ్చి, కొడుక్కి చివాట్లు పెట్టించి, చెల్లెలి కాపురం

## మువ్వల మురళి

చక్కదిద్దాలనుకున్నాడు.

* * *

హరితను వూరుకోబెడుతున్న విశాలి, ఆమెను మెల్లగా ప్రశ్నించసాగింది.

"హరితా! ఆ రోజా అనే అమ్మాయి మీ ఇంటికి వచ్చి ఎన్ని రోజులు అయింది?" హరిత చెప్పింది.

"ఆ అమ్మాయే వచ్చిందా? అన్నయ్య గారు వెళ్లి వెంటబెట్టుకు వచ్చారా?"

"అదే వచ్చింది" నిరసనగా చెప్పింది, కళ్లు తుడుచుకుంటూ.

"అంటే, అన్నయ్యగారు ఆ అమ్మాయితో బాగా చనువుగా వుండటం నువ్వు కళ్లతో చూశావా?" అనుమానంగా అడిగింది. ఆమెకు భర్త మాటలు కూడా ఒక్కోసారి నమ్మబుద్ధి కావటంలేదు.

"అంటే, నా మాటలు నీకు ఇంకా నమ్మకం కుదరలేదా!" రోషంగా అడిగింది.

"అదికాదు హరితా! నలుగురిలో తిరిగే మగవాడ్ని మనం తప్పుపట్టి అనుమానించ కూడదు" అంది ఆడపడుచు తలనిమురుతూ.

"వదినా! నా కళ్లతో చూసింది అబద్ధం అంటావా? అర్ధరాత్రి ఆయన లేచి రోజా గదిలోకి వెళ్లి తలుపులు మూసుకోవటం, ఇది అంతా నా అనుమానమే అంటావా?" అంది కన్నీళ్లతో.

ఆ మాట వినటంతోనే విశాలి గాఢంగా నిట్టూర్చింది.

"ఒక్కోసారి మన కళ్లే మనల్ని మోసగిస్తుంటాయి. కళ్లతో చూసినవన్నీ నిజాలు కావు. చెవులతో విన్నవన్నీ పరమ సత్యాలూ కావు. నిండు మనసుతో చూడగలిగినవాడే అసలైన జ్ఞాని. పరిపూర్ణ విశ్వాసంతో ఎదుటి వాళ్లని అర్థం చేసుకున్నవాడే మహాత్ముడు. ఈ సత్యాన్ని నువ్వు నమ్మగలిగితే, నీ హృదయ నేత్రాలతో నీ భర్త మనస్తత్వ గ్రంథాన్ని క్షుణ్ణంగా చదవగలిగితే, అప్పుడు

(52వ పేజీ చూడండి)

# మంగళకరమైన వెన్నెల మోమును
# మెరుగు పరచటానికి

## ఐటెక్స్
## మాట్ ఫినిష్ తిలకం

దేశమంతటా నాగరిక యువతులు కోరి ధరించేది ఐటెక్స్
తిలకం నారీమణుల పుష్ప విధానాన్ని అద్భుత సౌందర్యాన్ని
ప్రస్ఫుటం చేసేటందుకే కన్నులకింపైన 14 రంగులలో
దొరుకుచున్నవి. శాస్త్రీయ విధానంలో తయారుచేయబడు
ఐటెక్స్ తిలకం చర్మానికి ఎటువంటి హానియూ కలుగజేయదు

**ఐటెక్స్** 38 సంవత్సరములుగ మీ నమ్మకానికి
పాత్రమైన ఉన్నతమైన చిహ్నం




**అరవింద్ లాబరేటరీస్** మద్రాసు 600 033

Imageads-AL-1240 R-Tel

# ప్రశ్నావళి

-కె. రామలక్ష్మి

ఎస్. ఆర్. ఎమ్. — చిత్తూరు

మగవారిని దుమ్మెత్తిపోయడానికి ఝామ్మని విరుచుకుపడే మీరు సెన్సారుబోర్డు మెంబరుగా వుంటూ కళ పేరుతో అంగాంగ ప్రదర్శన చేస్తున్న నటీమణులను ఏం చెయ్యలేకపోయారే?

★ ఎలావాళ్లని గైడ్‌లైన్సులో యిరికించలేం. అందుకేకదా, 'ఆడవారిని అవమానించే' విషయాలకై బైలైన్ గైడ్‌లైన్స్ రావాలని పోరుతున్నాను. చూద్దాం.

జె. బి. ఆర్. — మొగలవల్లి.

'ప్రేమకోసమై వలలో పడెనే పాపం పసివాడు' అన్నారు ఒక కవి. పసివాడు ప్రేమలో పడడం ఏమిటి?

★ వెర్రినాన్నా! ఇక్కడ పసివాడంటే అమాయకుడని అర్థం చెప్పుకోవాలి.

టి. కె. పి. — నూజివీడు.

మొన్నీమధ్య ఆరుద్రగారిని కలిసి 'గురువుగారూ! నాకసలు కోపం రావడంలేదు. ఏం చేయమంటారు' అని సలహా అడిగాను. వెంటనే 'మా ఆవిడగారిచ్చే జవాబులు చదవండి' అన్నారు. అలా ఎందుకన్నారంటారు?

★ కోపం, తాపం, ఒళ్లుమంట, తిక్క ఇవన్నీ బ్రతికివున్న మనుషుల లక్షణాలు. అంచేత వీటి లోపం కాస్త కాస్త చచ్చుతనాన్ని సూచిస్తుంది. మరీ మీరు ప్రశ్న రాసి నేను జవాబు రాసేసరికి ఆలస్యం అవుతుందని — తక్షాంతిగా ఆ జవాబు యిచ్చి వుంటారేమో. (అయినా యూహారన్ని మాట పొక్కసారిగా మాట్లాడారన్నా నేను నమ్మలేను! మహా అనివుంటే ఓ చిరునవ్వు అని వుండచ్చు — లేదా, ఆలోచనలో ఆ గెడ్డం రాసుకుంటూ మీ మాట వినిపించుకోకపోయినా నాకు ఆశ్చర్యం లేదు. జవాబు మీరూహించుకుని వుండమా వచ్చు — )

ఎ. కె. వి. — విజయవాడ.

అందరూ లోదృష్టి, అంతర్‌దృష్టి వుండాలి అంటూ వుంటారు. దీనికి అర్థం ఏమిటి?

★ చూపు మామూలు ప్రపంచం చూడ్డానికి. దృష్టి కనిపించని వాటిని చూడ్డానికి కావాలి.

యు. యు. — ఎమ్మిగనూరు.

సృష్టిలో సౌందర్యానికి, స్త్రీ సౌందర్యానికి భేదం లేదు. ఇదంతా ప్రతివోటూ 'కన్ను' కల్పించుకుంటున్న ఇంద్రజాలం అంటాడు చలం. మీరేమంటారు?

★ దీన్ని చలంగారే అనక్కరలేదు. తా వలచింది రంభ, తా మునిగింది గంగ అని — అంతా అనేమాటే.

జె. వి. ఆర్. — కలకత్తా.

సహాయం చేస్తున్న వారిని అనుమానించే వారిని ఏమనాలి?

★ అందుకే అడిగితేనే చేయాలన్నారు! అయినా సలహా విననివాళ్లకి సహాయం చేయడం కష్టం కదా — వూరుకోవాలంతే.

ఎ. ఎన్. ఆర్. — బుడితి.

స్త్రీకి పెళ్ళయి, పిల్లలు పుట్టాక గృహిణిగా బాధ్యతలు చక్కదిద్దడమే గౌరవం. రోజూ ఇంటినీ, పిల్లలనూ చూసుకుంటూ వుంటే ఇంటా బైటా గౌరవం అని నా అభిప్రాయం?

★ చిత్తం. పురుషుడి చిత్తం స్త్రీ భాగ్యం అని జపం చేయండి ఏం చేస్తాం! చదువుకున్నప్పుడు, అవసరం అయినప్పుడూ ఉద్యోగం చేయడం గౌరవ భంగం కాదు. కాని అంతమాత్రంచేత ఆ స్త్రీ యింటినీ, భర్తనీ, పిల్లలనీ నిర్లక్ష్యం చేసినట్టేనని అనుకోవడం పొరపాటు.

ఎమ్. ఎన్. ఆర్. — మిట్టపల్లి.

మానవుడు కోతినుంచి పుట్టాడు అంటారు. ఎంతవరకు నిజం?

★ చాలా మటుకది నిజమే అనిపించడం లేదూ, నేటి మానవుల కోతి చేష్టలు చూస్తుంటే?!

బి. సి. ఎన్. — ఆదోని.

సృష్టిలో స్త్రీ పురుషులకు సమాన బాధ్యతలు వున్నాయి కదా! మరి స్త్రీలు మాత్రం సమాన హక్కులు కావాలని పోరాడుతున్నారు? బాధ్యతలున్నప్పుడు హక్కులు లేకుండా పోతాయా?

★ సృష్టిలోనూ, కాగితంమీదా సమ బాధ్యతలు సమ హక్కులూ వున్నాయి. కాని అమలులో మటుకు బాధ్యతల బరువులే మోసే గాడిదగా తయారైంది స్త్రీ. ఎంత గాడిదలకేనా నడుం విరిగే బరువు అంటూ ఎక్కడో వుంటుంది — దానితో కళ్ళు తెరచి చుట్టూ ప్రపంచం చూసి — మన బ్రతుకులే ఎందుకిలా కాలాయి? అని ముందు తమని తాము — తరవాత చుట్టూ మనుషులని ప్రశ్నించడం జరుగుతుంది. తరువాత సాధించడానికి — తెగింపు తెచ్చుకోడం జరుగుతుంది. ప్రస్తుతం మనదేశంలో బరువులు దింపిచుట్టూ కలయచూసి తమని తాము ప్రశ్నించుకునే దశలోకి వచ్చింది స్త్రీజాతి...అంతే!

బి. ఎల్. ఎల్. — సునాబేడ.

స్త్రీకి అలకే అందం అంటారు. మరి పురుషునికి?

★ ఆ అలక తీర్చడమే — అందం — ఆనందం.

పురుషుడు అలిగితే?

★ ఆడంగి అంటారు!

ఎ. ఏ. — కరీంనగరు.

రామాయణం మూడు ముక్కల్లో కట్టె, కొట్టె, తెచ్చె — అలాగే రాజకీయాలని మూడు ముక్కల్లో చెప్పండి?

★ ఏముంది ఆనంద్ — మార్చె (పార్టీ) వచ్చె (పదవి) చేర్చె! (ధనం) పోయె (పరువు). ఫరవాలేదు! ★










"పెళ్ళాం బొగ్గులతో వంట చేయలేక చస్తూంటే మీకేమీ పట్టడంలేదు. కిరసనాయిల్ తెమ్మని ప్రొద్దునగా పంపిస్తే ఖాళీ డబ్బాలో తిరిగివస్తారా? ఈవేళ నేను భోజనం వండేదిలేదు, పెట్టేదిలేదు." అని లక్ష్మి ఖాళీ డబ్బాతో వచ్చిన భర్త రామారావుని చూసి కోపంగా వంటింట్లోకి వెళ్ళిపోయింది.

"లక్ష్మికేం తెలుసు ? ప్రొద్దున్నుంచి ఎండలో కిరసనాయిల్ కోసం క్యూలో నిలబడి తను ఎంత కష్టపడిందీను. క్యూలో సగంమందికిచ్చి మధ్యాహ్నం అయ్యేటప్పటికి కొట్టు చక్కగా కట్టేసి షావుకారు భోజనానికి బయలుదేరాడు. ఇదంతా చెప్పినా లక్ష్మి వినే స్థితిలో లేదు" అనుకొని చొక్కా తీసి దండెం మీద వేసి, అలసటగా మంచంమీద వాలాడు. రామారావు.

వంటింట్లోంచి లక్ష్మి చిన్నగా గొణుక్కుంటూ దబీ దబీమని చప్పుళ్ళు చేయడం రామారావుకి వినిపించసాగింది.

ఏంచేయాలో తోచనట్లు మంచం ప్రక్కనే ఉన్న పేపరు తీసి చూడసాగాడు. పేపరులో వార్తలు చూస్తుంటే కనుబొమలు ఆశ్చర్యంతోను, భయంతోను ముడిపడ్డాయి.

* * *

"ఏమండోయ్ ! మిమ్మల్నే! అబ్బబ్బ వినిపించు కోరు. ఇంటి సంగతి బొత్తిగా మీకక్కరలేదు. ఇంటిలో బియ్యం నిండుకొన్నాయి. బియ్యం తెచ్చిపెట్టండి. అటునుంచి అలా బజారులోకి వెళ్ళి కాయగూరలు కొని తెండి" అంది.

"అలాగే... అలాగే" అని సంచి చేతో పట్టుకొని నడక మొదలుపెట్టాడు రామారావు.

బియ్యం కొట్టుకు వెళ్ళి, "కిలో బియ్యం ఎలాగండి" అన్నాడు రామారావు.

"కిలో పదిహేను రూపాయలు" అన్నాడు కొట్టువాడు.

"ఏమిటీ! కిలో పదిహేను రూపాయలా! వెనకటి రోజుల్లో రెండు రూపాయలుండేది. ఏమిటీ దారుణం ?" అన్నాడు ఆశ్చర్యంగా.

"ఆ రోజులు వేరండి. ఇప్పుడు పంటలు తక్కువ. జనాభా ఎక్కువ. ఇందులో మాకు మిగిలేదేంలేదు" అన్నాడు కొట్టువాడు.

"ఇదేం చోద్యమండీ ? మన ఆంధ్రదేశంలోనే బియ్యానికి కరువు వచ్చిందా! పైగా ప్రభుత్వం ఎన్నో డామ్‌లు కట్టి, కాలువలు త్రవ్వింది కూడా."

"ఎన్ని డామ్‌లు కట్టినా ఫలితమేమిటి ? ఎరువులు లేకుండా పంటలు ఎలా పండుతాయి ? ఇంతకీ మీకు బియ్యం కావాలా ? అక్కరలేదా ? చెప్పండి" అన్నాదు కొట్టువాడు విసుగ్గా.

"అయ్యో! కావాలండి...కడుపుకి అన్నం కూడా లేకపోతే ఎలాగండి! పది కిలోలు ఇవ్వండి" అని డబ్బు కొట్టువాని చేతికి అందించాడు.

చేతో బియ్యం సంచి పట్టుకొని కాయ గూరల కోసం ప్రక్క సందులోకి వెళ్ళాడు రామారావు.




''వంకాయలు కిలో ఎంత ?'' అన్నాడు రామారావు.

''పదిరూపాయలు'' అంది కాయగూరలమ్మి.

''అయ్య బాబోయ్ ! వంకాయలు వద్దుగాని బెండకాయలు కావాలి, ఎలాగమ్మ'' అన్నాడు రామారావు.

''పన్నెండు రూపాయలు చేసుకోండి'' అంది.

''ఏమిటే, పన్నెండు రూపాయాలా ! వద్దుగాని బంగాళా దుంపలు ... ''

ఒక నిర్లక్ష్యమైన చూపు రామారావు వైపు చూసి 'కాయగూరలు తినే ముఖంలా లేదు'. అని క్రొత్తగా వచ్చిన వ్యక్తివైపు చూసి – ''మీకేం కావాలో చెప్పండయ్యా'' అంది.

రామారావుకి ఆ అమ్మ అలా అన్నందుకు బాధ అనిపించలేదు గాని, ధరలు అలా పెరిగిపోయినందుకు మతిపోయింది. రకరకాల ఆలోచనలతో ఉన్న రామారావు శరీరంలో ఒక్కసారి నిస్సత్తువ చోటు చేసుకొంది. ఇక నడువలేక దగ్గరలో ఉన్న బస్ స్టాప్‌కు వెళ్లి నిలబడ్డాడు.

కంట్లో ఏదో నలక పడడంతో చేత్తో కన్ను రుద్దుకుంటూ చూశాడు. పెద్ద చప్పుడు రోడ్ రోలరులాగ చేసుకొంటూ, వంటింట్లో కట్టెలపొగ గొట్టంలోంచి పొగ వచ్చినట్లుగా, దట్టమైన పొగతో, చుట్టూ కటకటాలు, పైన టాపుతో బొగ్గుతో నడిచే బస్సువచ్చి ఆగింది.

''ఓహో ! దీని మహిమా !'' అని బస్సు దగ్గరకు వచ్చాడు రామారావు.

కిక్కిరిసిన మనుష్యులతో బస్సు ఆగినట్లే ఆగి, దిగేవారు ఎవరూ లేకపోవడంతో దడదడమని శబ్దం చేస్తూ వెళ్లిపోయింది.

నిస్పృహగా వెళ్లిన బస్సువైపు చూశాడు. మరో రెండు బస్సులు వచ్చి మొదటి బస్సు పద్ధతినే ఫాలో అవుతున్నట్లుగా వెళ్లిపోయాయి.

కాళ్ళు పీకసాగాయి రామారావుకి. చేతిలోని సంచిని రెండవ చేతిలోకి మార్చుకొని, 'అనవసరంగా నిలబడ్డాను. నడచిపోవాల్సింది' అనుకుంటున్నంతలో మరొక బస్సు వచ్చి ఆగింది.

గభాలున ఫుట్‌పాత్‌మీదకు ఎక్కి రాడ్ పట్టుకున్నాడు రామారావు.

నిండుచూలాలు భారంగా అడుగులు వేస్తున్నట్లుగా నెమ్మదిగా వెళ్లసాగింది బస్సు.

''ఇదే ఆయిల్ బస్సు అయితే తను దిగవలసిన స్టాప్ అయిదు నిమిషాల్లో వచ్చేది. అనవసరంగా ఎక్కాను'' అని నిట్టూర్చాడు.

ఎలాగైతేనేం ఇల్లు చేరుకున్నాడు రామారావు. కంచంముందు కూర్చుని ఖరీదులు ఎలా పెరిగి పోయాయో చెప్పసాగాడు లక్ష్మితో.

కంచంలో అన్నం వడ్డించి నీళ్లో, మజ్జిగో తెలియని మజ్జిగగిన్ని, కంచందగ్గర పెట్టింది లక్ష్మి.

మజ్జిగ కంచంలో పోసుకుంటూ, ''ఏమిటి లక్ష్మి... కనీసం మజ్జిగవాసనైనా లేకుండా ఇంత పలచన చేశావు'' అన్నాడు.

''బాగుందండీ మీ వరుస... నేనేమైనా మీకోసం ప్రత్యేకించి నీళ్ళు ఎక్కువ కలిపానంటారా? అరలీటరు పాలు పోయించుకుంటున్నాము. ఇంటందరము సర్దుకోవాలాయే'' అంది.

అవునుకదూ ! అంటూ చప్పన భోజనం ముగించి కంచం ముందునుంచి లేచాడు రామారావు.

* * *

తెల్లవారింది. కాలకృత్యాలు ముగించుకొని, పేపరు హెడ్‌లైన్సు చూడసాగాడు రామారావు.

ఆకలి చావులు, పొలాల్లో పంటలు దోచుకు పోవడం, లూటీలు... దోపిడీలు, హత్యలు ఎక్కడ చూసినా అంతకుమించి వార్తలు కనిపించలేదు.

ఇంతలో పోస్టుమేన్ టెలిగ్రాం తీసుకు రావడంతో కంగారుగా టెలిగ్రాం అందుకొని చదివాడు.

''లక్ష్మి ! అల్లుడు దగ్గరనుంచి టెలిగ్రాం వచ్చింది. కంగారేం పడకు. అమ్మాయి డెలివరీ కోసం మనని అర్జంటుగా రమ్మని ఇచ్చాడు. నేను ఆఫీసుకి వెళ్లి సెలవుపెట్టి వస్తాను. నువ్వు ప్రయాణానికి సిద్ధంగా ఉండు.'' అని రామారావు ఆఫీసుకి వెళ్లాడు.

రామారావు తిరిగి రాగానే వెంటనే ఇద్దరూ స్టేషన్‌కి బయలుదేరారు. రెడీగా ఉన్న ట్రైన్ ఎక్కారు ఆదరా బాదరాగ. ప్రయాణం అంతా కూతురికి ఎలా ఉందోనని కంగరు పడసాగింది లక్ష్మి.

దిగవలసిన ఊరు రావడంతో ట్రైన్ దిగి బస్ స్టాండ్‌కు వెళ్లారు. అక్కడకి నలభై మైళ్ల దూరంలోనే ఉన్న పల్లెటూర్లో అల్లుడు, కూతురు ఉంటున్నారు.

''తొందరగా వెళ్లి బస్సు టిక్కెట్లకి ప్రయత్నించండి. అలా చూస్తారేమిటి ! అవతల అమ్మాయి ఎలా ఉందో ఏమో !'' అని కోపంగా అంటున్న భార్యవైపు చూసి టిక్కెట్ల కోసం బస్సు వద్దకు వెళ్లాడు రామారావు.

ఒక్కొక్క బస్సుకు టిక్కెట్ల కోసం ప్రయత్నించసాగాడు. మధ్యాహ్నం క్యూలో నిలబడ్డ వాడు ఎలాగైతేనేం సాయంకాలానికి బ్రతుకుజీవుడా అంటూ బట్టలు నలిగిపోయి, జుట్టు చెదిరి టిక్కెట్లు పట్టుకొని విజేతలా లక్ష్మి దగ్గరకు వచ్చాడు రామారావు.

ఇద్దరూ ఎలాగైతేనేం బస్సు ఎక్కారు.

సుత్తితో తల బ్రద్దలుకొడుతున్నట్లు దడదడ శబ్దంతో ''అంతమంది ఒక్కసారి బస్సు ఎక్కుతారా? మీకు తగిన పనిష్మెంటు ఇస్తాను. పొగతో ఉక్కిరిబిక్కిరై ఏడవండి' అన్నట్లు దట్టమైన పొగ వదులుతూ బస్సు బయలుదేరింది.

రామారావుకు రాత్రంతా బస్సులో ఒళ్ళు హూనం అయినందుకు బాధ అనిపించలేదుగాని, సెలవు ఇచ్చిన రెండు రోజుల్లో ఒకరోజు ప్రయాణానికి అయిపోయినందుకు బాధ అనిపించింది.

బస్సుదిగి ఒళ్ళంతా మసితో కూతురి ఇంటికి వెళ్లారు. వీధి వరండాలో నిలబడి అటు ఇటు పచార్లు చేస్తున్నాడు అల్లుడు ప్రసాద్.

ఇంట్లోకి అడుగుపెడుతూనే లక్ష్మి ''అమ్మాయి ఎలా ఉందో చెప్పు బాబు !'' అంది కంగారుగా.

''మరేం కంగారు పడకండి అత్తగారూ ! అసలు నేనే నిర్మలను తీసుకువచ్చి మీ దగ్గర వదలుదామను కున్నాను. లీవు దొరకలేదు. బిడ్డ అడ్డంగా ఉందని, ఆపరేషన్ అవసరం ఉంటుందేమోనని ఇక్కడ డాక్టరు అంది. ఇది మరీ పల్లెటూరు. మీదగ్గరైతే బాగుంటుందని టెలిగ్రాం ఇచ్చాను'' అన్నాడు ప్రసాద్.

రామారావు, లక్ష్మి మరునాడు నిర్మలతో తిరుగు ప్రయాణమయ్యారు. ప్రొద్దున్నే క్యూలో నిలబడ్డ రామారావు ఎలాగైతేనేం మధ్యాహ్నానికి టిక్కెట్లు సంపాదించాడు.

''మాయదారి జనం. ఎక్కడ చూసినా ఖాళీ ఉండదు'' అని లక్ష్మి విసుక్కుంది.

బస్సు ఎక్కారు. లక్ష్మి ''ఏమండోయ్ అలా తోసుకుంటూ బస్సు ఎక్కితే ఎలా ? నిండుచూలాలు మీద పడుతున్నారు. తరువాత బస్సులో రావచ్చు కదా'' అంది చిరాకుగా ఒక పెద్దమనిషిని ఉద్దేశించి.

''బాగుందమ్మా సలహా, ఈ బస్సుకు చచ్చిచెడి టిక్కెట్టు తీసికొంటే ఇంకో బస్సులో వెళ్లాలా ?'' అన్నాడు కోపంగా. ''అయినా అసలు ఇంకా పిల్లల్ని కనమని ఎవరు చెప్పారు ? అసలే జనాభా ఎక్కువైపోతుంటే'' అని ఒక యువకుడు దెప్పిపొడిచాడు.

### చేదు నిజాలు

ఆశల కడలిలో
ఊసులాడుకుంటున్నా
కోర్కెల జలధిలో
కొట్టుకుపోతున్నా
కలల వారాశిలో
తేలియాడుతున్నా
ఆలోచనా సాగరంలో
లోలోపల వెతుకుతున్నా
ఎందుకో తెలసా !
ఊహాలోకం విడిచిపెట్టి
వర్తమానం వెన్నుతట్టి
పరికించాలని ...
పరికిస్తే ... తిలకిస్తే ...
కానేకాదవి రంగుల హంగులు — అవి
కలచివేయు చేదు నిజాల పొంగులు

— వి.వి.ఎస్.బి. కుటుంబరావు

వాళ్ళకేం తెలుసు. నిర్మలకి తొలిచూలు ఆడబిడ్డ. ఇది రెండవ కాన్పు అని.

"ఊరుకో అమ్మా... వాళ్లతో వాదన ఎందుకు ?" అంది సిగ్గుగా నిర్మల.

మర్నాడు ఉదయం ఆఫీసుకి బయలుదేరాడు రామారావు.

"ఏమండీ ! వాడి గురించి ఏమైనా పట్టించు కుంటున్నారా ? రవికి పదేళ్ళు వచ్చేవరకు స్కూల్లో సీటు సంపాదించలేకపోయారు ! ఏదో ఐదు మైళ్ళ దూరంలో సీటు సంపాదించారంటే వాడికి పుస్తకం తెస్తానని చెప్పి ఇన్నాళ్లు చేస్తారా ? అంత మతిమరుపైతే ఎలాగండి ? ఆమ్మాత్రందానికి పెళ్లి ఎందుకు చేసుకొన్నారు ? పిల్లల్ని ఎందుకు..."

"లక్ష్మీ !" అసహనంగా అరిచాడు రామారావు.

"మన కనీస అవసరాలు తీరాలంటే నా జీతం చాలదు. లక్ష్మీ ! నాకొచ్చే జీతం లాంటిది రెండు జీతాలు కావాలి. నేను పుస్తకం మరచిపోలేదు. షాపుకి వెళ్ళాను. ఒకటవ తరగతి పుస్తకం ఖరీదు ఇరవైరూపాయలట. పేపరుకు కూడా కరువు వచ్చిపడిందట. చూస్తూ చూస్తూ ఒకటవ తరగతి పుస్తకం ఇరవైరూపాయలిచ్చి కొనలేక పోయాను."

"ఇదెక్కడి విడ్డూరమండీ ? అయితే ఉన్న ఒక మగబిడ్డడిని చదువులేకుండా ఊరుమీద వదిలేద్దామా !" అంది.

"ప్చ్ ! ... నీకేం చెప్పినా అర్థంకాదు లక్ష్మీ ! ప్రతినెలా రెండుపూటలా భోజనం చేయడానికి నేనెంత జాగ్రత్తగా బడ్జెట్ తయారుచేసి డబ్బు ఖర్చు పెడుతున్నానో తెలుసా ! అయినా నెలాఖరు రోజుల్లో ఎంత ఇబ్బంది పడుతున్నాం ? ఈ నెల నిర్మల పురిటి ఖర్చులూ అవీ ఉన్నాయి. నా తల బ్రద్దలవుతుంది. వాడికా పుస్తకం అవసరం లేకుండా నేను వ్రాసి పెడతానులే ఎవరినన్నా పుస్తకం అడిగి" అన్నాడు రామారావు.

## రచయితలకు మనవి

కథలు పంపేవారుకూడా విడిగా తపాలా బిళ్లలు పంపటం, లేదా కథ పంపిన కొంత కాలానికి తపాలా బిళ్లలు పంపటం చేయ వద్దని మనవి. కథల పరిశీలనకు ఆరు నుంచి పది వారాలు పట్టవచ్చును కథ ప్రచురణ మోదం పొందిన వెంటనే రచయితకు కార్డు ద్వారా తెలియజేస్తాము. నవలల విషయంలో ఏ విషయం తెలియటానికి నాలుగు మాసాలు పట్టవచ్చును. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదని మరోసారి మనవిచేస్తూ — మాతో రచయితలంతా పై నిబంధనల విషయంలో సహకరించాలని కోరుతున్నాము. కలర్ ట్రాన్స్‌పెరెన్సీలు పంపేవారు గూడా తిరుగు టపా కవరు పెట్టడం అవసరం. సం॥

## నీతి సూరీడు

చలిమంచుతెరలవల్ల
అరుణోదయం ఆలశ్యం కావచ్చు,
చలిమంచు చినుకులవల్ల
భూదికి ఇంకాస్త ఇబ్బంది కావచ్చు,

కాని, నిశిరాత్రుల బేజారుతనాన్ని పోగొట్టి
మంచు చినుకులను గాలిలో కలుపుతూ,
గాలిలో చిరువెచ్చదనం నింపుతూ,
నిశిరాత్రుల బేజారుతనాన్ని బజారుపాలుచేసి,
శాకుంతల శ్రావ్యనాదాలతో కావ్యాలేవో వినిపిస్తూ,
మెల్లగానైనా వస్తాడు నీతి సూర్యుడు...

లేదు లేదు ఇంకా రాలేదు అని బేజారుపడకు,
రాదు రాదు ఇంక రాను అని భయపడిపోకు...

అవినీతి అంధకారాలను ప్రతిఘటిస్తూ
అరుదుగానైనా వస్తాడు ఆలస్యమైనా వస్తాడు
వాడే నీతి సూరీడు...

— మల్లెపూడి మార్టిన్ లూథర్

## కాలచక్రం

ఒక్క నిముషం మౌనం వహించి "అది సరే లెండి, అమ్మాయి పెళ్లి విషయం ఏం చేశారు ? మీ స్నేహితుని కొడుకు ఉన్నాడన్నారు" అంది లక్ష్మి.

"ఆ ... సుజాత పెళ్లి గురించే ఆలో చిస్తున్నాను. ఆఫీసునుంచి తిరిగి వచ్చేటప్పుడు అలా వాళ్లింటికి వెళ్తాను. కాస్త మంచినీళ్ళు తీసుకురా" అన్నాడు రామారావు.

*   *   *

"కూర్చో రామారావ్ !...నాకైతే స్నేహితుని కూతురిని కోడలిగా చేసుకోవాలని ఉంది. కాని ఈ కాలం పిల్లలు మన మాటకి విలువ ఎక్కడ ఇస్తున్నారు ? వాడు ... అదే మా అబ్బాయి శంకర్ అమ్మాయిని ఇష్టపడ్డాడు. కాని కట్నం విషయం అదీ వాడి ఇష్టప్రకారమే జరగాలట. వాడిని పిలుస్తాను. వాడితోనే మాట్లాడు" అన్నాడు రంగారావు.

"నమస్కారమండీ !" అని ఎదురు కుర్చీలో కూర్చున్నాడు శంకర్.

ప్రతి నమస్కారం చేశాడు రామారావు.

మాటల అనంతరం వంట్లో శక్తి లేనట్లు కాళ్ళీడ్చుకొంటూ రోడ్డుమీదకు వచ్చాడు రామారావు. ఈ సంబంధం కూడా ఇలా తప్పిపోయినందుకు ఇంటికి వెళ్లి లక్ష్మికేం చెప్పాలి అనే బాధ రామారావు మనస్సులో బయలుదేరింది... కొంచెం సేపయినా ప్రశాంతంగా ఎక్కడైనా గడపాలన్నట్లు దగ్గరలోనే ఉన్న పార్కులోనికి దారితీశాడు.

పార్కునిండా జనం కిటకిటలాడుతున్నారు. ఆ ప్రదేశమంతా వెచ్చని సెగలా ఉంది. ఎలాగూ దూరాను కదా అని ఎలాగైతేనేం అతికష్టంమీద చోటు సంపాదించి ఒక జంట ప్రక్కగా కూర్చున్నాడు.

"సురేష్ ! ఇన్నాళ్లు నువ్వు చూపించే ప్రేమంతా నటనా ? పెళ్లి విషయం ఎత్తేసరికి ఇలా మారిపోతావనుకోలేదు." అని ఇక మాట్లాడలేక కళ్ల నీరు నింపుకుంది ఆ అమ్మాయి.

"మై డియర్ స్వీట్ సుని. ఆఫ్‌కోర్సు నిన్ను ప్రేమించాను. కాదనడంలేదు. కాని నేను ఊరికినే పెళ్లాన్ని పోషించడానికి లక్షాధికారిని కాను. ఐ వాంట్ మనీ మై డియర్, అండర్‌స్టాండ్ ?"

ఇక వాళ్ల సంభాషణ వినే ఓపికలేక అక్కడ నుంచి లేచి ఇంటికి బయలుదేరాడు రామారావు.

"ఏమిటండీ ! అలా ఉన్నారు ? ... అయ్యో అలా ముఖం వేలాడేసుకొని వచ్చారేమిటి ? ఈ సంబంధం కూడా తప్పిపోయిందా ?" ఆత్రుతగా అడిగింది కుర్చీలో కూర్చుని అలసటగా కళ్ళు మూసుకొన్న రామారావు వైపు చూసి లక్ష్మి.

"లక్ష్మీ ! ... చివరిసారిగా చెబుతున్నాను లక్ష్మీ ! నేను అసమర్థుడిని ! ... బాధ్యతలు తెలియకుండా పిల్లల్ని కన్నాను" అన్నాడు రెండు చేతుల మధ్య ముఖం దాచుకొని.

"ఏమండీ ! ఎందుకండీ అలా బాధపడు తున్నారు ! అసలేమయింది నాతో చెప్పండి. రంగారావుగారు పెద్దఆశలో లేరన్నారు కదండీ ?" అంది లక్ష్మి.

"అవును లక్ష్మీ ! రంగారావు పెద్దఆశలో లేడు. కాని వాడి కొడుకు ఉన్నాడు. వాడు సంపాదించేది వెయ్యిరూపాయల జీతం. కాని కట్నం లక్షరూపాయలు కావాలట. అంత ఇచ్చుకోలేనంటే 'ఈ రోజుల్లో ఒక మనిషిని పోషించడం అంటే మాటలనుకున్నారా ?' అన్నాడు. నిత్యావసర వస్తువులే కాదు. కట్నాలు కూడా బాగా పెరిగి పోయాయి. నేను ఈ బాధ్యతలు మోయలేను ! అమ్మాయి పెళ్లి చేయలేను. అసమర్థుడిని ... అసమర్థుడిని" అని బలంగా జుట్టు పీక్కోసాగాడు రామారావు.

*   *   *

"ఏమండోయ్ ! ఏమిటండీ పట్టపగలే కలవరింతలు ? మీకేం చక్కగా నిద్రపోతున్నారు. నాకు తప్పుతుందా ? ప్రక్కింటి ఆమె నడిగి బొగ్గులు తెచ్చి వంట చేశాను. వడ్డిస్తాను రండి" అని వచ్చినంత వేగంగా వంటింట్లోకి వెళ్లిపోయింది లక్ష్మి.

"ఏమిటి ! ఇంతవరకు తను కల కన్నాడా ? పేపరు చూస్తూంటే 'ముప్పై ఏళ్లలో ప్రపంచ మంతటా చమురు నిల్వలు అయిపోతాయి' అని చదివిన వార్త తనలో ఎన్ని ఆలోచనలు బయల్దేరదీసింది ! దాని ప్రభావం ఇప్పుడే చూపిస్తోందా కిరసనాయిల్ కూడా దొరకడంలేదు అనుకొన్నాడు చమురు నిల్వలు అయిపోతే ఒక్క కిరసనాయిలేకాదు పెట్రోలు, ఎరువులు మొదలైనవన్నీ అయిపోయి నట్లే కదా. అప్పుడు మన పరిస్థితి ఎలా ఉంటుందో నన్న ఆలోచనలతో మగతగా నిదుర పట్టిన తన ఎంత విచిత్రమైన కల వచ్చింది ! ఇది కల అయినా నిజం కావడానికి ఎన్నాళ్ళో లేదు కూడా" అని అనుకుంటూ వంటింట్లోకి దారితీశాడు రామారావు.

మిగిలిన తెల్లదనాలని మైమరపించే స్వచ్ఛమయిన
తెల్లదనం యిచ్చే స్కోర్—నీలం డిటర్జెంట్ బిళ్ల.
ప్రకాశవంతమయిన తెలుపు. తెల్లని తెలుపు.
సాటిలేని తెలుపు! స్కోర్ నీలం డిటర్జెంట్ బిళ్ల
మీ దుస్తుల మురికిని పోగొట్టి వాటికి
పరిశుభ్రమయిన తెలుపుని యిస్తుంది.
స్కోర్ నీలం డిటర్జెంట్ బిళ్లతో ఎన్నో బట్టలు.
వుతకవచ్చు. ఎంతో తెల్లగా. రంగు దుస్తులకి
కూడా మెరుపుతనం తెస్తుంది.

## విజయ సాధనలో
## తళ తళ మెరిసే తెలుపు!

# స్కోర్

**నీలం డిటర్జెంట్ బిళ్ల**

కేరళ స్టేట్ డిటర్జెంట్స్ & కెమికల్స్ లిడ్.
(ఒక ప్రభుత్వ సంస్థ)




విజయ సాధనలో
తళ తళ మెరిసే తెలుపు!

FDS KSDC 3022A TEL

# ప్రేమతీర్థం

## 8

(గత సంచిక తరువాయి)

నేను ఇంటికి వెళ్ళేసరికి నాన్నగారు ఆఫీసు కెళ్ళబోతున్నారు. నన్ను చూడగానే, కారు దిగి, "గుడ్, చదువు ముగించుకొని వచ్చేసావన్నమాట. అయినా వచ్చేముందు వస్తున్నట్లు ఉత్తరం వ్రాయలేదేం. కారు పంపేవాడినిగా" అని నాన్నగారు అంటుంటే నేను ఆశ్చర్యంగా, "అదేమిటి! టిక్కెట్ బుక్ అవగానే వ్రాసానే మీకు అందలేదా!" అన్నాను.

"ఓహో! మర్చిపోయాను. సారీ మై సన్. ఈమధ్య ఈ ఫ్యాక్టరీ గొడవల్లో బొత్తిగా తీరుబడికూడా లేకుండాపోతోంది. సరే, ఇక నువ్వు వచ్చేసావ్‌గా, ఈ విషయాలన్నీ నువ్వు చూసుకుందువుగానిలే" అని కార్లో ఎక్కబోతూ ఒక్క క్షణం ఆగి, "అన్నట్టుమీ అమ్మ వాళ్ళ క్లబ్ మెంబర్స్‌తో కాశ్మీర్ వెళ్ళింది, రెండు రోజులలో వచ్చేస్తుంది. ఈ బోర్ కొడితే రికార్డ్ ప్లేయర్ పెట్టుకో. కొత్తగా మీ అమ్మ నీకోసం చాలా రికార్డ్స్ కొంది... సరే రెస్ట్ తీసుకో, మళ్ళీ సాయంకాలం కలుద్దాం..." అంటూ నాన్నగారు వెళ్ళిపోయారు.

ఇంటికి రాగానే ఖాళీగా వున్న ఇల్లు, నాకోసం ఎదురు చూసే వాళ్ళు ఎవరు లేకపోవటం నన్ను చాలా నిరాశపరిచింది. అమ్మ ఇంట్లో వున్నాకూడా అంతంత మాత్రమే. ఎప్పుడూ క్లబ్స్, మీటింగ్స్.

ఆ రోజు ఎలాగో గడిపేసాను. పాత స్నేహితులకు టెలిఫోన్ చేసి కబుర్లు చెప్పటంతో చాలా టైమ్ గడిపాను.

మరునాడు సాయంకాలం ఏం తోచక సీత వాళ్ళ ఆఫీస్‌కి వెళ్ళాను. ఆమె చెప్పిన అడ్రస్ ప్రకారం ఆటోలో వెళ్ళాను. నేను వెళ్ళేసరికి ఆమె ఆఫీస్‌నుంచి బయటకు వస్తూ నన్ను చూసి విష్ చేసింది.

"ఏమిటి, ఎటువైపు పయనం?"

"మీ ఆఫీస్‌కే!"

"సారీ సర్, ఆఫీస్ మూసేసారు." నవ్వాను.

"ఇంటికి వస్తారా!"

"వద్దు. అలా ఏదైనా రెస్టారెంట్ కెళదాం."

"అలాగే పదండి." దగ్గర్లో వున్న కామత్ వైపు నడిచాం.

కాఫీకి ఆర్డర్ ఇచ్చింది సీత.

"సీతతో ఏం మాట్లాడాలో అర్థం కాలేదు. నన్నుగురించి ఏమనుకుంటుందో అన్న భయం. ఏదో రైల్లో జరిగిన చిన్న పరిచయం పట్టుకొని ఇలా వెంటబడ్డాడనుకుంటుందా? ఏమో!"

"ఏమిటి, అంత మౌనంగా వున్నారు."

సీతే కదిపింది.

"ఏం లేదు. నా గురించి ఏమనుకుంటున్నారా... అని ఆలోచిస్తున్నాను."

"ఏముంది అనుకోటానికి. బహుశ ఇంట్లో తోచివుండదు. నేను గుర్తువచ్చి వుంటాను. వచ్చేసారు."

"ఔను. అలాగే జరిగింది. వచ్చేవరకు ఎప్పుడొస్తానా అనిపించింది. కాని వచ్చాక పొద్దుపోవటంలేదు ఇక్కడ. ఉద్యోగం త్వరగా వచ్చేస్తే బాగుండుననిపిస్తోంది..."

"భలేవారే. నిన్న చదువు అయిపోయిందో లేదో ఉద్యోగం కోసం దిగులుపడుతున్నారా. అయినా ఇలా అడుగుతున్నానని ఏమి అనుకోకండి, ఆర్థికమైన ఇబ్బందులా..." సీత జాలిగా అంది.

పెద్దగా నవ్వాను.

**జరిగిన కథ—4 :** పెళ్ళి కాకుండనే తల్లి కాబోతున్న కూతురు దీపను పురుడు అయ్యేవరకు తనదగ్గర వుంచుకోమని న్యూయార్క్‌లో ఉంటున్న చెల్లెలు భామనుతి, అక్కయైన శారదమ్మకు ఉత్తరం వ్రాస్తుంది. ఆమె అనుమతితో శారదమ్మ పొలం వ్యవహారాలను చూస్తున్న చంద్రం ఏర్‌పోర్ట్‌కి వెళ్ళి దీపను తీసుకువస్తాడు. దీప వేషధారణను చూసి ఆ పల్లెలోవాళ్ళు ఆశ్చర్యంతో వింతజంతువును చూసినట్లు ప్రవర్తిస్తుంటారు. చంద్రం ప్రతీనెలా దీపను తీసుకెళ్ళి విజయవాడలోని లేడీడాక్టర్‌కు చూపించి తీసుకు వస్తుంటాడు. తనకు పుట్టబోయేబిడ్డను ఏ అనాథాశ్రమంలోనో జేర్పించి, తన తల్లిదండ్రుల వద్దకు వెళ్ళిపోతానని చెప్పిన దీపనుచూసి నివ్వెరపోతాడు చంద్రం. అలా ఆమె వదలివెళ్ళిపోయే పక్షంలో, పుట్టబోయే ఆ బిడ్డను తాను పెంచుకుంటానని చంద్రం శారదమ్మతో చెప్తాడు. దీప బలవంతంమీద, తనకూ సీతకు గల పూర్వ వృత్తాంతాన్ని ఆమెకు చెప్తుంటాడు చంద్రం. చదువు ముగించుకొని ఇంటికి వస్తున్న చంద్రానికి రైల్వేస్టేషన్‌లో సీత పరిచయం అవుతుంది.

"అదెలా వుంటుందో చిన్నప్పటినుంచి నాకు తెలియదు." అంటూ నాన్నగారు నడుపుతున్న ఫ్యాక్టరీ పేరు చెప్పాను.

సీత ఆశ్చర్యంగా నా వంక ఒక్క క్షణం చూసి "మరి, ఉద్యోగం ఏం ఖర్మ" అంది నవ్వుతూ.

"లేదండి. నాకు బిజినెస్ చేసే టాక్టిక్స్ తెలియవు. ఏదో చదువుకు తగ్గ ఉద్యోగం దొరికితే, నాన్నగార్కి ఎలాగైన నచ్చచెప్పి చేరిపోవాలని వుంది..."

కాఫీలొచ్చాయి.

"నా మటుకు నాకు ఈ ఉద్యోగాలే నచ్చుతాయండి. నెల తిరిగేసరికి ఏదో కొంత డబ్బు. మనం ఇష్టమొచ్చినట్లు స్పెండ్

# ప్రేమ తీర్థం

చేసుకోవచ్చు. సినిమాలు చూడచ్చు, చీరలు కొనుక్కోవచ్చు..."

"అంతేనా! క్యాడ్‌బరీస్ చాక్‌లేట్స్ మాట..."

"ఓ... దట్ ఆల్‌సో. మీరింకా మర్చిపోలేదా."

సీత నవ్వింది గలగల.

"మీరు ఉద్యోగం చేస్తున్నారంటే ఏదో సరదాకన్నమాట. బాధ్యతలేవీ లేవా!" అన్నాను. సీత మాట్లాడే తీరుబట్టి, ఆమె స్వేచ్ఛా విహంగంలా అనిపించింది.

"బాధ్యతలంటూ ఏమి లేవనే చెప్పాలి. మా అమ్మా, నాన్న బందర్ దగ్గర ఓ పల్లెటూరిలో వుంటారు. అక్కడ మాకేవో కొద్ది పొలాలున్నాయి. కాబట్టి వాళ్ళ భుక్తికి లోటులేదు. ఇక్కడ నేను మా అన్న, వదినలతో వుంటున్నాను. అన్నయ్య స్టేట్ బ్యాంక్‌లో క్లర్క్. ఒక్కడే కొడుకు. ఇక నా జీవితం గురించి అడిగే వాళ్లెవ్వరూలేరు. మా వదినే అంటుంది – 'ఈ కాలం అబ్బాయిల రేటు రోజు రోజుకి పెరుగుతోంది. కాస్త నువ్వు కూడా దాచరాదా, మంచి మొగుడ్ని కొనుక్కోవచ్చు' అని. నా డబ్బు దాచుకొని అదే కట్నం రూపేణ ఇచ్చుకొని భర్తని కొనుక్కోవటం నా అభిప్రాయాలకు విరుద్ధం. బహుశ అందుకేనేమో! నా కింకా పెళ్ళికాలేదు." చివర మాటలు సీత చూపులు మరో వైపుకు తిప్పుకుంటూ అంది.



బేరర్ ఈలోగా బిల్లు ఇచ్చాడు. సీత గబుక్కున తీసుకోబోతుండగా, నేనే అందుకొని బిల్లు 'పే' చేసాను, సీత కోపంగా చూస్తున్నా పట్టించుకోకుండా.

ఇద్దరం ఏవో కబుర్లు చెప్పుకుంటూ నడుస్తున్నాం. దారిలో ఒక ఫొటో స్టూడియో దగ్గర ఆగి, సీత తను బొంబే, పూనాలో తీసుకున్న రీల్సు ప్రింట్ కిచ్చింది. ఏవో కబుర్లు చెప్పుకుంటూ రెండు మూడు బస్ స్టాప్స్ దాటాం. టైమ్ చూసుకొంటే, హఠాత్తుగా గుర్తుకొచ్చింది – 6 గం.లకు ఒక ఫ్రెండ్‌ని మీటవుతానని చెప్పిన విషయం. ఆమెకు గుడ్ బై చెప్పి దగ్గర్లో వున్న బస్ స్టాండ్‌వైపు నడిచాను.

* * *

ఆ మరునాడే డాడి చెప్పినట్లుగానే అమ్మ కాశ్మీర్ నుంచి వచ్చేసింది. స్టేషన్‌కి కారు తీసుకెళ్లాను. నన్ను చూసి అమ్మ చాలా ఆశ్చర్యం వెలిబుచ్చింది. అమ్మ వస్తూ వస్తూ నాకు వులెన్ బట్టలే కాకుండా, కుంకుమ పూవు, ఆపిల్స్, హౌస్ డెకరేటింగ్ పీసెస్ పూలచెట్లు. ఇలా చాలా తెచ్చింది. రెండు, మూడురోజుల వరకు అమ్మ కాశ్మీర్ టూర్ విశేషాలు చెబుతుంటుంటే వింటూ బయటకు కదల్లేదు.

తరువాత ఒకరోజు సీతని కలుసుకున్నాను, ఆఫీస్‌లో! అప్పటికింకా ఆఫీస్ క్లోజ్ చేయలేదు. నన్ను తమ గెస్ట్‌రూమ్‌లో కూర్చోబెట్టింది సీత. సీత వచ్చేవరకు పక్కనున్న మాగ్జైన్స్ తిరగేస్తూ గడిపాను.

"మీ అమ్మగారు వచ్చేసారనుకుంటాను" వస్తూనే సీత అడిగింది.

"ఊఁ ఎలా తెలుసుకున్నారు!"

"సింపుల్. మీరీ మధ్య మళ్ళీ ఒక్కసారి కూడా ఇటువైపు రాలేదు."

"బాగుంది!" ఇద్దరం హాయిగా నవ్వుకున్నాం.

"ఏదైనా సినిమా కెళదామా సీతా!" అడిగాను.

"అలాగే. ఇంటికి ఫోన్‌చేసి చెబుతాను. అయితే, ఒక షరతు. మీరు మళ్ళీ నన్ను ఇంటికి వచ్చి దింపాలి. ఈ హైదరాబాద్‌లో ఒంటరిగాఆటోలో వెళ్ళేధైర్యం నాకులేదు."

"అక్కర్లేదు. నేను కారు తెచ్చాను. నిన్ను డ్రాప్‌చేసే వెళతాను. ఓ.కే" అన్నాను.

సీత తీయటి స్నేహమాధుర్యాన్ని చవి చూస్తున్న నాకు నెలరోజులు ఎలా గడిచి పోయాయో తెలియలేదు. ఈ మధ్యలో నా రిజల్ట్సు రావటం, నేను ఫస్ట్‌క్లాస్‌లో పాసైనందుకు నాన్నగారు తన ఫ్రెండ్స్ అందరికి గ్రాండ్‌గా పార్టీ ఇవ్వటం కూడా జరిగిపోయింది. అయితే ఆ పార్టీకి నేను సీతని కూడా రమ్మని ఆహ్వానించాను. సీత పాపం ఇల్లు వెతుక్కుంటూ, వచ్చింది. ఎంతో సంతోషంగా, సీతని అమ్మకి పరిచయం చేయబోయాను. కాని అమ్మ ఒక చూపు సీతమీద విసిరి, "సరేఁ! నా కిప్పుడు అర్జంటు పనుంది, ఆ అమ్మాయిని అలా వెళ్ళి కూర్చోమను. వనిత కూడా పార్టీకి వస్తుందిట. నువ్వెళ్ళి రిసీవ్ చేసుకో" అంటూ హడావిడిగా వెళ్ళిపోయింది. నా మనసును చాలా చిన్నబుచ్చింది. సీత మనసులో ఏం బాధపడిందో, కాని పైకేమి పట్టించుకోనట్లే మాట్లాడింది. సీత కొద్దిసేపు వుండి, వెళ్ళిపోయింది. నా మనసు ఆమె పట్ల చాలా బాధపడింది. ఇక పార్టీ ఎలా ముగిసిందో, నేను పట్టించుకోలేదు.

ఆ సంఘటన అయ్యాక సీతని కలుసుకో లేకపోయాను. ఆమె మొహం చూడాలంటే, ఏదో తప్పు చేసినట్లు ఫీలైయ్యాను.

ఒకరోజు నాన్నగారు, అమ్మ లాన్‌లో కూర్చుని టీ త్రాగుతూ కబుర్లు చెప్పు కుంటున్నారు. అలాటి సన్నివేశాలు నేను ఆ ఇంట్లో చూడటం చాలా అరుదు. అదే మంచి సమయం అనిపించింది, నా ఉద్యోగం విషయం చెప్పటానికి.

"రావోయ్,మైసన్. నీగురించేమాట్లాడు కుంటున్నాము. మీ అమ్మ నీ పెళ్ళి చేసి కోడల్ని తెచ్చుకోవాలని తొందర పడుతోంది. అన్నట్టు మొన్న పార్టీలో 'వనిత'ను చూసావు కదూ. ఎలా వుంది?" నాన్నగారు చెప్పే సంగతులు వింటుంటే ఉక్కిరి బిక్కిరి అయ్యాను. నేను ఒక విషయం మాట్లాడాలని వస్తే మరొక విషయం వైపు వెళ్ళింది. నిజానికి పెళ్ళి గురించి అంతకు ముందే నేనొక నిర్ణయానికి వచ్చాను. సీతతో స్నేహం చేస్తున్నది, కేవలం కాలక్షేపానికి కాదు, పెళ్ళి చేసుకోవాలన్న ఉద్దేశ్యంతోనే. ఉద్యోగం వచ్చాక పెళ్ళి విషయం చెబుదా మనుకున్నాను. కాని పరిస్థితులు అంతవరకు ఆగేలా లేవు.

"నాన్నగారూ! ముందు నా ఉద్యోగం దొరకనివ్వండి ..." అన్నాను నానుస్తూ.

నాన్నగారు పెద్దపెట్టున నవ్వారు.

"వనితవాళ్ళ ఫాదర్ ఎవరనుకున్నావు? ఆల్ ఇండియాలో ఒక పెద్ద బిజినెస్ మాన్! ఆయనంతట ఆయన నాకు ఫోన్ చేసి పెళ్ళి విషయం ఎత్తారంటే, నువ్వు చేయబోయే ముష్టి ఉద్యోగం చూసికాదు. ఉద్యోగం మాట తలపెట్టకు. ఆయన నిన్ను ఫారిన్ పంపించే తలంపులో వున్నాడు.అక్కడ నుంచి వచ్చాక, మన ఫ్యాక్టరీ ఎటూ వుందిగా! ఏమంటావ్!"

నా ఇష్టా ఇష్టాలతో ప్రమేయం లేకుండా నా జీవితాన్ని వాళ్ళంతట వాళ్ళేనిర్ణయించటం నాకు నచ్చలేదు.

"కాని ... నాన్నగారూ! నా భార్యవైపు నుంచి వచ్చే ఆస్తి, అవకాశాలు నాకక్కర్లేదు. మనకి చాలా ఆస్తులున్నాయి. నేను పెళ్ళి చేసుకుంటే, ఓ పేద అమ్మాయిని చూసి చేసుకోవాలనుకుంటున్నాను."

"అదేమిటి చంద్రం...అలా అంటున్నావ్. పిరిరా మోకాలు అడ్డె పెళ్ళుంటారా" అమ్మ మొహం చికాకుగా పెట్టింది.

నాన్నగారు సీరియస్‌గా నా వంక చూస్తూ "అయితే, ఎవరో అమ్మాయిని మనసులో పెట్టుకునే మాట్లాడుతున్నా వన్నమాట. ఇంతకు ఎవరా అమ్మాయి?"

అమ్మ హఠాత్తుగా గుర్తుకు వచ్చిన దానిలా, "ఓహో, అదా ... విషయం. ఆ రోజు ఎవరో అమ్మాయిని తీసుకొచ్చాడు. పేదరికానికి చిహ్నంగానే వుంది పిల్ల. నేను పెద్ద పట్టించుకోలేదు. అప్పుడే తెలిపి వట్లైతే, ఎడాపెడ నాలుగు నాయించే దాన్నే ... ఎప్పుడెళ్ళిందో, కనీసం మర్యాద కైనా వెళుతున్నానని నాతో చెప్పలేదు. అలాంటి వాళ్ళకి మన మర్యాదలు, మన పద్ధతులు ఏలా తెలుస్తాయి." అమ్మ సీతను గురించిహీనంగా మాట్లాడుతుంటే మౌనంగా వింటం తప్ప ఏం చేయలేకపోయాను. సీతకు ఆ రోజు చేసిన 'మర్యాద' అమ్మ మర్చే పోయింది.

"ఏం చంద్రం ... అమ్మ చెప్పిన అమ్మాయేనా, నువ్వు పెళ్ళి చేసుకోవాలను కుంటున్నావు?"

"అఁ అమ్మాయే. పేరు సీత. ఇక్కడే

(40 వ పేజీ చూడండి)



# పెళ్లిగోలలో చంటిగోల

సరోజ (రాజ్యలక్ష్మి) ఉలిక్కిపడింది. అడుగులో అడుగు వేసుకుంటూ వస్తున్న చంటిబాబు (నూతన్‌ప్రసాద్)ని చూసి, "నువ్వు దొంగ పిల్లిలా దూరావన్నమాట ? అలా రావటం తప్పుకదూ ?" అంది.

అంతే. చంటిబాబు ఏడ్పు లంకించుకున్నాడు.

"అదిగో మళ్ళీ ఏడుస్తున్నావు. చేసింది వెధవ పని. పైగా, ఏడుపొకటి ... ఆడదానిలాగా ఎందుకేడుస్తావ్ ?" సరోజ విసుక్కుంది.

"ఏం ? మగవాళ్ళు ఏడవకూడదా ? నాది మగవాడి ఏడుపే," అన్నాడు చంటిబాబు అమాయకంగా.

"నీకిదే పనా ?"

"కొంతమందికి పాడటం అలవాటు. నాకు ఏడవటం అలవాటు. ఆ దేవుడెవడో ఫామిలీ ట్రబుల్స్‌లో ఉన్నప్పుడు నా బొమ్మని తయారు చేసి, నాకు ఏడుపురాత రాసేశాడు." బావురు మన్నాడు చిట్టిబాబు.

"అదిగో మళ్ళీ ఏడుస్తున్నావ్. నువ్విలా ఏడిస్తే, నేనిక్కడ్నుంచి వెళ్లిపోతా."

"ఇలా ఏడవక పోతే నాకేం తోచదే ... సరే. కాసేపు ఏడవనులే. ఇలా పక్కన కూర్చో," అంటూ చంటిబాబు మంచంమీద కూర్చున్నాడు.

"ఎప్పుడూ నవ్వుతూ ఉండాలి."

"నవ్వితే ఏడుపు పోతుందా ?" చంటిబాబు నవ్వడానికి ప్రయత్నిస్తూ, మళ్ళీ ఏడుపు ముఖం పెట్టాడు.

"ఏయ్ ! మళ్ళీ ఏడుస్తున్నావు కదూ ?"

"ఇదెక్కడి గొడవరా, బాబూ ! నేను నవ్వుతున్నా — ఏడుస్తున్నట్టుందా ? ఒకే, చంటీ ! నీకిదో అగ్నిపరీక్షరా ! కాదు; కన్నీటి పరీక్ష. రెప్ప వెయ్యకుండా నిద్రపోగలవేమోగాని, ఏడవకుండా ఎలారా నిద్రపోవటం ? సరే — నవ్వటం ప్రాక్టీసు వెయ్యమందిగా? అది ఇప్పట్నించే చేద్దాం," అంటూ చంటిబాబు ముసుగు బిగదన్ని పడుకున్నాడు.

కట్టా సుబ్బారావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో యు. ఎస్. ఆర్. మోహనరావు నిర్మించే రాజ్యలక్ష్మి కంబైన్స్ "పెళ్ళిగోల"లో మురళీమోహన్, మోహన్‌బాబు, నాగభూషణం, సారథి, కాకరాల,

## అక్టోబర్ 10న హరిశ్చంద్రుడు

"పాత్రలుగాని, సన్నివేశాలుగాని, సందర్భాలుగాని — ఏ రాజకీయ నాయకుల జీవితాలకో ప్రతిరూపాలైతే, వారి చివరి రోజులు ఎలా ఉంటాయనేది ఈ చిత్రాన్ని చూసయినా గ్రహిస్తారని ఆశిస్తున్నాం" అన్నారు లోగడ ఎన్నో సంచలన చిత్రాలు నిర్మించి, జాతీయ అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిన 'లయన్' యు. విశ్వేశ్వరరావు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తూ నిర్మించిన "హరిశ్చంద్రుడు" చిత్రం అక్టోబర్ 10న విడుదలవుతుంది. సుప్రసిద్ధ దర్శక నిర్మాతలు పి. పుల్లయ్య, కె. బి. తిలక్, బి. ఎ. సుబ్బారావు ప్రభృతులు ఈ చిత్రంలో నటించడం ఓ విశేషం. వీరితోపాటు జయచిత్ర, సావిత్రి, దేవిక, ప్రభాకరరెడ్డి, కృష్ణవేణి, సుజాత, పూర్ణిమ, శ్రీలక్ష్మి, ఎం. రంగారావు, ఎన్. వి. ఎస్. ప్రసాదరావు, బోసు, మున పత్యం, బేనా, ఇంకా

## రామచంద్రపురం పరిసరాలలో ఊరుకి మొనగాడు

"సెప్టెంబర్ 1 నుంచి 14 వరకు రామచంద్రపురం తాలూకాలో జరిగిన చివరి షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తయింది," అన్నారు కె. రాఘవేంద్రరావు. ఈయన దర్శకత్వంలో గోపి మూవీస్ అధినేత ఎ. గోపాలకృష్ణ నిర్మించే పై చిత్రానికి రామచంద్రపురంలోని పెద్దకోటలో, చిన్నకోటలో, కూళ్ళ, వాకతిప్ప గ్రామాల్లో మూడు పాటలను, పలు సన్నివేశాలను చిత్రీకరించారు. కృష్ణ, జయప్రద, చంద్రమోహన్, రాజ్యలక్ష్మి, గీత, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య, కాంతారావు, రూప్సి, పుష్పలత పాల్గొన్నారు. సత్యానంద్, చక్రవర్తి, వేటూరి, కె. ఎస్. ప్రకాష్, శ్రీనివాసరాజా, కోటగిరి వెంకటేశ్వరరావు, జాస్తి, చలసాని శరత్, శేఖర్ తెరవెనుక కృషి చేశారు.

మధుమాలిని

## శుభోదయంలో ప్రణయోదయం

డ్యూటీలో జాయిన్ అయిన చంద్రం (చంద్రమోహన్)తో "అది నీ సీటు. ఆ సీట్లో ఇదివరకుండే ఆవిడకి పొట్ట వచ్చి శలవ పెట్టింది." అంది లేడీ టైపిస్ట్ శివకామి (మనోరమ).

చంద్రం అయోమయంగా చూశాడు.

"పొట్టా ?"

"అదేనప్పా. ప్రెగ్నెన్సీ."

ఇంతలో గీత (సులక్షణ) వస్తూ, "అప్పుడే

జి. మోహనకృష్ణ, వీరప్ప, ప్రకాశరావు, కె. రఘునాథరెడ్డి, జి. ఎస్. బాబు ప్రభృత సాంకేతికవర్గం



"బంగారు బావ"లో
కృష్ణ, శ్రీదేవి

ఎంతోమంది ఔత్సాహిక కళాకారులు పాల్గొన్నారు. కొండవీటి వేంకటకవి సంభాషణలు రాశారు. ఈయనతోపాటు శ్రీశ్రీ, విశ్వేశ్వరరావు రాసిన గీతాలకు టి. చలపతిరావు స్వరకల్పన చేశారు. మోహన్‌కృష్ణ, దొమ్మేటి సుబ్రహ్మణ్యం, ఆర్. హనుమంతరావు, పి. జి. మోహన్, బెనర్జీ, శేషు, కె. రాధాకృష్ణ, వెంకటస్వామి, గోవిందు, సోము, గణేశ్ తెరవెనుక కృషి చేశారు. "ఈ చిత్రాన్ని లోకనాయక్ స్వర్గీయ జయప్రకాష్ నారాయణ్‌కు అంకితమిచ్చాం," అన్నారు యు. విశ్వేశ్వరరావు.

## భోగ భాగ్యాలు

"డిసెంబర్‌లో షూటింగ్ స్టార్ట్ చేస్తాం," అన్నారు పి. చంద్రశేఖరరెడ్డి. ఈయన దర్శకత్వంలో తయారయ్యే గ్రామీణ వాతావరణం గల ఈ చిత్రంలో కృష్ణ, శ్రీదేవి, మాడా ప్రసాద్, గుమ్మడి, రమాప్రభ ఆదిగాగల వారుంటారు.

## కొత్త చిత్రాల పేర్లు

ఎ. ఎస్. ఆర్., సుజాత, శ్రీదేవిలతో వి. మధుసూదనరావు దర్శకత్వంలో నిర్మాత రావుల అంకయ్య గౌడ్ డిసెంబర్ నుంచి ప్రారంభించే రవీంద్ర ఫిలిమ్స్ చిత్రం "బంగారు కానుక".

కె. ఎస్. ఆర్. దాస్ దర్శకత్వంలో విజయలలిత, ఆమె భర్త డి. వెంకట్రామయ్య సారధ్యంలో వి. రామమోహనరావు, శ్రీనాథ్ నిర్మించిన రాజా ఆర్ట్స్ క్రియేషన్స్ చిత్రం "రగిలిన పగ".

శారద, మాదవి నటన అనుపమ నరసన మాడా ప్రసాద్ ద్విపాత్రాభినయం నిర్వహించే పవన్ ఇంటర్నేషనల్ వారి చిత్రం "ఓ అమ్మ కథ". ఎస్. ఆర్. వేజెళ్ళ, వి. జోషి ఈ చిత్ర నిర్మాతలు

—జి.వి.జి.

కంగ్రాట్యులేషన్స్ బస్సు దొరికేసరికి కాస్త లేటయింది," అంది

"మీరు బస్సులో రావడమేమిటండీ?" అన్నాడు చంద్రం

గీతకు శివకామి ఒక ఫైల్ ఇస్తూ, "గీతా, మేనేజర్ దగ్గర సిగ్నేచర్ తీసుకురా!" అంది

చంద్రం అదిరిపడ్డాడు "చూడండి, మేడమ్! ఆ సీట్లో క్లర్క్ రాలేదా? పాపం, ఓవర్ గారమ్మాయే"

"ఎవరు — ఆవిడా? ఆవిడ ఓనరుగారమ్మాయి కాదప్పా డిస్పాచ్ క్లర్కు"

గీత లేచి, "నా టేబుల్‌మీద కేర్టైనా ఫైల్ ఏస్తే, డాడీ రూంలో ఉంటాను పంపించండి," అంటూ వెళ్ళింది

చంద్రం మరింత నిర్ఘాంతపోయాడు "అది కాదండీ — మీరేమో గీత రావుగారమ్మాయి కాదంటున్నారు గీత, రావుగార్ని 'డాడీ' అని పిలుస్తోంది. అసలు గీత, రావుగారి అమ్మాయా? లేక — రావుగారి పేరు డాడీరావుగారా? ఏమిటో అంతా కన్‌ఫ్యూషన్‌గా ఉందండీ"

"అయ్యో గురువాయూరప్పా! ఎన్నాప్పా! ఏమిటో నువ్వు చెప్పేదే గొలగొలగా ఉందప్పా!" అంది శివకామి

"అసలు గీత ఎవరండీ?"

"రావుగారి అమ్మాయే కాని, ఈ ఆఫీసులో మాత్రం కాదు, ఇక్కడ మామూలు క్లర్క్"

"అలాగా! చంపేశారు కదండీ — నన్నెన్నూ, మీరూనూ," అంటున్న చంద్రం, గీత తిరిగివచ్చి తన సీట్లో కూర్చోవడం చూసి, "ఇవ్వాళ నాకు ఎంత ఆనందంగా ఉందో చెప్పలేను మన అభిరుచులు కలవటమే కాకుండా — మనిద్దరం ఎంత దగ్గరిగా వచ్చేశామో చూశారా?" అన్నాడు

"మనది ఏడడుగులే దూరం పద్మావతి అప్పమాట ఈ నెంబర్ ఆ అక్కౌంట్ ఫైల్‌లో ఉందో — లేదో చూడండి," అంటూ ఒక కాగితాన్ని అందించింది గీత

చంద్రం, ఆమె వంకే రెప్పలార్పకుండా చూస్తూండిపోయాడు

కె. విశ్వనాథ్ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఎడిటర్ జి. జి. కృష్ణారావు సమర్పించే శ్రీరామ్ ఆర్ట్ పిక్చర్స్ "శుభోదయం" చిత్రానికి ఏ. హెచ్. నరసింహారావు నిర్మాత



"ప్రేమ సింహాసనం"లో
మంజుభార్గవి, ఎన్. టి. ఆర్.

# సినిమా

## తోడుదొంగలులో దారిదోపిడి

మారి కార్యుడ్రయివ్ చేసుకుంటూ వచ్చి ఓ చోట ఆపి, దిగాడు. కిశోర్ (చిరంజీవి) పరుగునవచ్చి, "టైం ఎంతయింది, సార్ ?" అంటూ మారి చేతిగడియారాన్ని చూశాడు.

"ఏళరే, అప్పా !" అన్నాడు మారి.

కిశోర్ ఏదో కవర్ అందించి, "సార్ ! ఈ కవరేదో కింద పడింది," అన్నాడు. మారి "నాది కాదప్పా," అనేసరికి, "పొన్లెండి, సార్! ఐదొందలు ఇచ్చేయండి. వెళ్ళిపోతాను," అన్నాడు కిశోర్.

మారి తృళ్ళిపడ్డాడు. "ఐదొందలా ! ఏమప్పా ? ఎందుకియ్యవలె ?"

"అదేమిటి, సార్ ! వాచీ తీసుకొని చేతికి పెట్టుకున్నారు కదా, సార్ ?"

"వాచీనా ? ఆండవనే ! ఏమప్పా, ఈ వాచీ నేను నా పెండ్లిలో అలికమంచం ఎక్కినడిస్తే, పెండ్లిపిల్ల తరపున వాళ్ళు ఇచ్చినారప్పా."

"కాదు, సార్! ఇప్పుడే నా దగ్గర తీసుకున్నారు. అరిచి, జనాన్ని పిలుస్తాను. డబ్బెందుకివ్వరో చూస్తాను."

"ఇష్ ! అరవకుమీ ! ఎవరైనా పెద్దమనిషిని పిల్చి, ఈ వాచి సంగతి — కొత్తగా అడుగుతాం."

ఇంతలో కృష్ణ (కృష్ణ) కళ్ళజోడు సర్దుకుంటూ వచ్చాడు. కిశోర్ "చూడండి, సార్ ! పెద్దమనిషి కదా అని వాచీ చూపించి, కావాలా — అని అడిగాను, సార్ ! తీసుకొని, చూసుకొని, చేతికి పెట్టుకొని వెళ్ళిపోబోయాడు. సార్ ! నేను డబ్బడిగితే, అది తన వాచీనే అంటున్నాడు, సార్ !" అన్నాడు.

మారి ఏడ్పుముఖం పెట్టాడు. "రొంబ మోసం, మేస్త్రీరూ ! ఇది నా వాచీదా. నా పెండ్లిలో..."

కృష్ణ గంభీరంగా "చూడండి ! ఇప్పుడితను గొడవచేస్తే — స్మగుల్డ్ సరుకు అమ్మినందుకు అతన్ని, కొన్నందుకు మిమ్మల్ని — ఇద్దర్నీ పోలీసులు అరెస్ట్ చేసి, జైల్లో పెడతారు. ఇతనికేం — హాయిగా అక్కడే పడుకుంటాడు. మీ ప్రెస్టేజ్ ఏమైపోతుందో ఆలోచించండి, సార్. మధ్యవర్తిగా నా మాట విని, నాలుగొందలు ఇచ్చేయండి, సార్ ! లేదా — నేనే ఈ పక్కనున్న పోలీస్ స్టేషన్లో — భారత పౌరునిగా నా వ్యక్తి ధర్మాన్ని నేను నిర్వర్తిస్తాను," అన్నాడు.

"ఆగు, మేస్త్రీరూ ! ఎన్నమో నా మామ ఏడుస్తూ ఇచ్చినాడు. అందుకే అది ఇష్టంగా అయిపోచ్చింది... నా జేబిలో నాలుగొందలుదా ఉన్నాయప్పా ! తీసికో, అప్పా ! వెత్తంపాక్కు పోయినులే కొనవాలె. ఒక్క రూపాయి ఉంటే ఇష్టంగా ఇవ్వప్పా !" అంటూ మారి ఏడుస్తూ డబ్బు ఇచ్చాడు.

"నేనిస్తాను, సార్ !" అంటూ కృష్ణ, మారికి రూపాయి ఇచ్చి, తన నేస్తం కిశోర్ వంక విజయగర్వంతో కనుసైగ చేసి, కళ్ళజోడు సవరించుకొని, జారుకున్నాడు.

మారి "ఆండవనే ! ఎన్నాప్పా ఇది ? ఖర్మ ! ఖర్మ !" అంటూ తల బాదుకున్నాడు.

కె. మహేంద్ర నిర్మించే టి. వి. ఇంటర్నేషనల్ "తోడుదొంగలు" చిత్రానికి కె. వాసు దర్శకుడు. జంధ్యాల మాటలు, సత్యం సంగీతం, వెంకట్ ఛాయ తెరవెనుక హంగులు.

## దేవుడున్నాడు

హైద్రాబాద్ సమీపంలోని యాదగిరిగుట్టవద్ద షూటింగ్ ప్రారంభమయ్యే విశ్వమోహన్ పిలిమ్స్‌వారి సైచిత్రానికి సెప్టెంబర్ 19న ఆనంద్ గానం చేసిన తొలి గీతం ధ్వనిముద్రిక చేయబడింది. ఎస్. వి. రావు సంగీత దర్శకుడు. వేణుగోపాల్ కథ, మాటలు, పాటలు రాశారు. సుఖదేవ్ ఛాయాగ్రాహకుడు. కె. ఆత్మ సంకలనకర్త. నరసింహరాజు, సత్యేంద్రకుమార్, రాళ్ళపల్లి, హేమసుందర్, మదన్, ప్రభ, రమాప్రభ, నిర్మల నటిస్తారు. రాఘవేంద్ర దర్శకత్వంలో డి. భీమారావు, ఎన్. నరసింహారెడ్డి నిర్మాతలు. డి. అనసూయాదేవి సహనిర్మాత. సమర్పణ : పి. వి. నరసింహారావు.

"అల్లరి బావ"లో
జయప్రద






# బండోడు-గుండమ్మ

నిర్మాత: జి.వి.యస్.రాజు — ఈస్ట్‌మన్ కలర్

సంగీతం: చక్రవర్తి  కెమెరా: కన్నప్ప  ఆర్ట్: భాస్కరరాజు  ఎడిటింగ్: రాజగోపాల్

సాయికృష్ణా ఫిలిమ్సు  నైజాం: నారంగ్ ఎంటర్‌ప్రైజెస్ సికింద్రాబాద్. సీడెడ్: డి.బ్రహ్మయ్య త్రూ నవభారత్ ఫిలిమ్సు గుంతకల్

"కనకమహాలక్ష్మి"లో ప్రభ

## సంధ్యలో సందె ముసురు

మేడమీదున్న సంధ్య (సుజాత) గదిలోకి కృష్ణ వచ్చాడు. లైటు వేశాడు. బిక్కుబిక్కుమంటూ కూర్చొని ఉన్న సంధ్యను చూసి, "ఏమిటిలా చీకట్లో కూర్చున్నావ్ ? లైట్ వేసుకోలేదేం ?" అడిగాడు.

"ఉన్నట్టుండి నా చుట్టూ చీకటి ముసురు కుందని గ్రహించలేదు, కృష్ణగారూ ! కూర్చోండి."

"మధు ఉద్యోగం ఎలా ఉంది ?"

"బాగానే ఉంది. వాడిప్పుడిక్కడుండడంలేదు. ఫాక్టరీ దూరం కదా ? వచ్చి వెళ్లడం కష్టమని — దగ్గర్లో ఓ గది తీసుకుమండమని నేనే పంపించాను..." అంటున్నప్పుడు సంధ్య గొంతు తడబడింది.

ఇంతలో లత (భావన) టీ కప్పు తెచ్చి కృష్ణకిస్తూ, "అక్కకు ఎప్పుడూ మాగురించే... తనగురించి, తన ఆరోగ్యం గురించి ఆలోచించుకోమనండి. ఇలా రాత్రింబగళ్ళు పనిచేస్తూ పనిచేస్తూనే ఏదో రోజు అక్క మాకు దూరమైపోతుందని భయంగా ఉందండి... కృష్ణగారూ ! మీతో ఇలా మాట్లాడుతున్నానని ఏమీ అనుకోకండి. మాకోసం పెళ్ళి మానేస్తానని అక్క మీతో చెప్పిన రోజునే మీరు మందలించి, మీ హక్కు మీరు పొందేందుకు ప్రయత్నించి ఉంటే — ఈరోజు అక్క పరిస్థితి ఇలా ఉండేది కాదండి," అంది గద్గదస్వరంతో.

సంధ్య భరించలేక "లతా, నోరు మూసుకొని లోపలికెళ్లు !" అని అరిచింది.

"మాట్లాడనీ, సంధ్యా ! లత చెప్తున్నది నిజమేననిపిస్తోంది," అన్నాడు కృష్ణ.

"కృష్ణగారూ ! అన్నయ్య గురించి అక్క అబద్ధం చెప్పిందండి. అన్నయ్యని అక్క పంపలేదు. తనే మా ఖర్మానికి మమ్మల్ని వదిలేసి వెళ్లిపోయాడు," అంది లత.

కృష్ణ నివ్వెరపోయాడు.

సంధ్య తమాయించుకుంటూ, "దాని మొహం—చిన్నపిల్లకదా ? ఏదో తెలిసీతెలీని మాటలు ఎలా మాట్లాడ్తోందో చూశారా ?... వాడు మమ్మల్ని శాశ్వతంగా వదలి వెళ్లిపోలేదండి. వాడు... వాడు — నావాడు... నా చేతుల్లో పెరిగాడు... వస్తాడు... ఏదో ఓ రోజున ఈ అక్క కోసం తిరిగొస్తాడు. తప్పకుండా తిరిగొస్తాడు," అంటున్నప్పుడు ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి.

ఏ. కోదండరామిరెడ్డి దర్శకత్వంలో కంచర్ల పూర్ణచంద్రరావు నిర్మాతగా ఎ. ఆర్. ఎస్. శర్మ సమర్పించే శ్రీ సావరిన్ ఫిలిమ్స్ "సంధ్య" చిత్రానికి జంధ్యాల, చక్రవర్తి, ఆత్రేయ, సి.నా.రె., గోపాలరెడ్డి, నాయని మహేశ్వరరావు, రాధాకృష్ణమూర్తి, పద్మనాభం, భావనారాయణ తెరవెనుక కృషి చేస్తున్నారు.

## శ్రీదేవి ప్రయాణం చేయని వాహనం!

ఊటీ బోట్‌క్లబ్‌లోనే "సర్దార్ పాపారాయుడు" షూటింగ్... ఒక బోట్‌లో ఎన్. టి. ఆర్., శ్రీదేవి ఆ సరస్సులో విహరించే సీను. ఆ డ్యుయెట్ సాంగ్‌లో కొన్ని షాట్లను డైరెక్టర్ దాసరి నారాయణరావుగారు తీశాక శ్రీదేవి ఒడ్డుకు చేరుకుంది. "నేనిలా చిన్న చిన్న పడవలు ఎక్కాను. రైలు, విమానం, కారు, బస్సు, ఎద్దుబండి, టాంగా — అన్నిట్లోనూ ప్రయాణం చేశాగాని, ఇంతవరకు స్టీమర్ ఎప్పుడూ ఎక్కలేదు. ఆ కోర్కె ఒక్కటే మిగిలిపోయింది," అని చెప్పి శ్రీదేవి, "ఇలా మీరు ప్రయాణం చేయని వాహనం ఏదైనా ఉందా ?" అని నన్నడిగింది. ఉందన్నాను. ఏమిటంది. "అంబులెన్స్ వాన్," అన్నాను. "అమ్మబాబోయ్ !" అంటూ తుర్రుమంది తదుపరి షాట్‌లో పాల్గొనడానికి. 




చట్టబద్ధమైన హెచ్చరిక:
సిగరెట్ తాగడం ఆరోగ్యానికి హానికరం
STATUTORY WARNING:
CIGARETTE SMOKING IS INJURIOUS TO HEALTH

**1 రూపాయికి 10***

*గరిష్ఠ ధర స్థానిక పన్నులను అనుసరించి

CASVS-238-234 TI

మెయిన్ డీలరు : బొండాడ సూరయ్య & సన్, భీమవరం.




# ప్రేమంటే ఏమిటి?

మారెళ్ల ఉమాదేవి

లతని విడిచి వుండలేనని చెల్లాయి పెళ్ళికి సెలవు పెట్టి వచ్చిన మరునాడే అనిపించింది. ప్రతి క్షణం ఆమె కళ్ళల్లో మెదిలేది. 'రవీ' అన్న ఆమె పిలుపే చెవుల్లో మార్మ్రోగేది. ఆమె మాటలు పదేపదే వినాలనే ఆర్తితో కొట్టుకుపోయేవాణ్ణి.

"ఏమిటిరా అన్నయ్యా! కలకత్తా ఉద్యోగం కాదుగాని నువ్వు మరీ డల్‌గా తయారయ్యావు?" చెల్లాయి అనుమానంగా అడిగింది.

"పోవే! నేను డల్‌గా వుండడమేమిటి? 'ఈ వాగుడుకాయని కట్టుకుని బావగారు ఎన్ని అవస్థలు పడతారో' అని బెంగ పెట్టుకుంటున్నా." అన్నాను నిబ్బరంగా పోజ్ పెడుతూ.

"ఛ! పో" కోపం నటించింది చెల్లాయి.

"ఎలాగూ పోతాలే ఆ రెండు అక్షింతలూ వేసేసి" అన్నాను నవ్వుతూ.

యిల్లంతా బంధువుల్తో నిండిపోయింది. ఆడపెళ్ళివాళ్ళం కనుక అందరికీ చేతినిండా పని! "వీడికి ముందు పెళ్ళి చేసేయ్యవలసింది. కోడలు చూసుకునేది ఈ తంతంతా." అమ్మ తనలో తనే గొణుక్కునేది. నాకే పని చెయ్యాలనిపించేది కాదు. "నాన్నగారొక్కరే ఆ పందిళ్ళా అవీ చూస్తున్నారు. నువ్వు కాస్త సాయం వెళ్ళకూడదూ?" అనేది అమ్మ.

అమ్మ బాధ, బంధువుల సందడి భరించలేక పెరట్లో గుట్టవైపు నడిచాను. సాయంత్రం అయింది. ఎండ చల్లబడి చల్లటిగాలి వీస్తోంది. నాపరాయిమీద నడుం వాల్చాను. లత గూర్చి ఆలోచనలు పిచ్చివాణ్ణి చేసేస్తున్నాయి. సిగరెట్ తీసి వెలిగించాను.

"నీ పెదిమలు ఎర్రగా అందంగా వుంటాయి. వాటిని సిగరెట్ కాల్చి మసి చెయ్యకు రవీ" లత మాటలు అంతరాంతరాల్లో మెదిలాయి. అది అభ్యర్థనో, ఆజ్ఞాపనో అర్థమయ్యేది కాదు. సిగరెట్ దూరంగా విసిరేశాను. అంతంలేని ఆలోచనలు గతాన్ని తవ్వి తీస్తున్నాయి

* * *

ఉద్యోగం దొరకలేదు అని దిగులుపడుతున్న రోజులవి. ఆ రోజు వచ్చిన అపాయింట్‌మెంట్ లెటర్ అంతులేని ఆనందాన్ని మోసుకొచ్చింది.

'బాంక్ వుద్యోగం వచ్చింది. అదృష్టవంతుడివి.' అన్నారు అందరూ. అపాయింట్‌మెంట్ కలకత్తాలో. ఉద్యోగ పర్వంలో ప్రవేశించడానికి కలకత్తా బయలుదేరాను. అంతకుముందెప్పుడూ కలకత్తా రాలేదు. హౌరా స్టేషనులో దిగగానే కొంత దిగులుపడ్డాను ఆ జనాన్నీ, వాతావరణాన్నీ చూసి. బహుశా హౌరా స్టేషన్ని చూసి కాబోలు 'దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్' అన్నాడు గురజాడ. చిత్తరంజన్ అవెన్యూలో ఆనందభవన్‌కి టాక్సీలో బయలుదేరాను.

ఇండియా ఎక్స్ఛేంజ్ ప్లేస్‌లో మా బ్యాంక్ వుంది. మొదటి రెండు రోజులూ కొంత 'కొత్త' ఫీల్ అయినా ఒక వారం రోజుల్లో అక్కడ వాళ్ళతో కలిసిపోయాను.

నాకొలీగ్ వర్మ అన్నాడో రోజు — మీ తెలుగు వాళ్ళే తెలిసిన ఫామిలీ బాలిగంజ్‌లో వున్నారు. వాళ్ళ ఫ్రంట్ రూంలు రెండు సబ్‌లెట్ కింద యిస్తారట. మాద్దాం వస్తారా?

అప్పటికే యింటినుండి తెచ్చుకున్న డబ్బు సగంపైన అయిపోయింది లాడ్జింగ్‌కీ, భోజనానికీ.

ఆ రోజు సాయంత్రం వర్మా, నేనూ కలసి బయలు దేరాం యిల్లు చూడడానికి.

"రోజూ యింత దూరం రావాలా ?" బస్సు దిగి నడుస్తూ అన్నాను వర్మతో.

వర్మ నవ్వుతూ అన్నాడు — "యిది కలకత్తా ! యింతకన్నా దూరంనుండి వస్తారు, యూవెన్ లేడీస్ కూడా."

'కొన్నాళ్లకి అదే అలవాటౌతుంది' అని సరి పెట్టుకున్నాను.

వర్మా, నేనూ వెళ్లేసరికి ఆమె ఫ్రంట్ రూమ్‌లో కూర్చొని ఏదో పుస్తకం చదువుతోంది. మమల్ని చూసి విష్‌చేసి కూర్చోమంది. వర్మ నన్ను పరిచయం చేసాడు. ప్రపంచంలోని అందమంతా ఆమెలోనే యిమిడి వుందా అనిపించే సౌందర్యం ఆమెది. అంతటి లావణ్యవతిని ఫస్ట్ సైట్‌లో చూసిన వారెవరైనా కాస్త త్రొట్రుపడక మానరు.

ఆమె మమ్మల్ని కూర్చోమని చెప్పి లోనికి వెళ్లింది. ఆమె వెళ్లిన తర్వాత అడిగాను వర్మని, 'ఇంట్లో యింకెవరూ కనపడరేం ?' అని.

'ఒక బాబు వున్నాడు' అన్నాడు వర్మ కాస్త గంభీరంగా.

ఇంతలో ఆమె బిస్కెట్లూ, టీ తీసు కొచ్చింది. "ఆయా లేదేమిటండీ" అన్నాడు వర్మ. బహుశా టీ ఆమె తీసుకుని రావడం చూసేమో.

"ఇప్పుడే బాబుని తీసుకుని వెళ్లింది కాళీ ఘాట్‌లో ఏదో పిల్లల ప్రోగ్రాం వుందని." అంది ఆమె టీ కప్పుల్లో పోస్తూ.

నాకంతా అయోమయంగా వుంది. 'ఈమె కెక్కడా పెళ్లి అయినట్టే కనిపించడం లేదు. మరి ఈ బాబు, ఆయా — వీళ్లంతా ఎవరు ? ఆమె భర్త ఏడీ ?' నేనేమీ మాట్లాడడం లేదని కొంత సేపటికి తెలుసుకున్నాను. "ఓడ్ హౌస్ బుక్స్ మీరు లైక్ చేస్తారా ?" ఏదో మాట్లాడాలి కదా అని సగం తెరచి వుంచిన ఓడ్ హౌస్ పుస్తకం చూస్తూ అన్నాను. ఏదో సినీ నటిని ఒక పత్రికా విలేఖరి అడిగిన ప్రశ్నలా వుందని గ్రహించి సిగ్గుపడి పోయాను వెంటనే.

"మూడ్ సరిగా లేనప్పుడు తెరుస్తాను ఓడ్‌హౌస్ బుక్స్. ఎంతటి సీరియస్ మూడ్‌నైనా చిటికెలో జాలీగా మార్చేసే శక్తి ఆయన రచనలకే వుందనిపిస్తుంది" అంది వెంటనే.

కొంతసేపు పుస్తకాలమీద జరిగింది మా సంభాషణ. చివరకి వర్మ అన్నాడు — ఈ రూమ్‌లు రెండూ మీ కిస్తారు. నచ్చాయా మీకు ?

నరకంలో కాపురం చేసి స్వర్గానికెళ్లి స్వర్గం బాగోలేదన్నట్టుంటుంది ఆ గదులు బాగోలేవంటే. నా కెంత తొందరగా ఆ హోటలు విడచిపెట్టేద్దామా అని వుంది. నా అంగీకారం చెప్పాను. 'ఆదివారం వచ్చేస్తానని' చెప్పి బయలుదేరాం.

దారిలో వర్మ చెప్పాడు ఆమె గూర్చి — ఆమె 'కోల్ ఇండియా'లో ఒక ఎగ్జిక్యూటివ్. భర్త క్రిందటి సంవత్సరం కారు యాక్సిడెంట్‌లో మరణించాడు. అతనూ, వర్మా ఫామిలీ ఫ్రండ్స్. ప్రస్తుతం ఆమె ఒక్కర్తే బాబుతో వుంటోంది. బాబుకోసం ఒక ఆయాని పెట్టుకుంది. తల్లీ,

## ప్రేమంటే ఏమిటి ?

తండ్రీ మద్రాసులో వుంటున్నారు. వీళ్లది ఇంటర్ కేస్ట్ మ్యారేజ్. ఆ కోపంతోనే ఆమెవైపు వాళ్లెవరూ రారు.

'యింతటి అందాల రాశిలో యిన్ని అగ్ని పర్వతాలా !' అనుకుని నిట్టూర్చాను.

* * *

ఆ యింట్లోకి మారి ఒక నెల గడిచింది. ఈ నెలరోజుల్లో ఆ కుటుంబ సభ్యులు ముగ్గురితో బాగా చనువేర్పడింది. లత నా కంటే నాలుగేళ్లు పెద్ద. నన్ను 'నువ్వు' అనే పిలిచేది. నేను 'లతగారూ' అనకపోయినా ఆమెని 'నువ్వు' అని మాత్రం పిలవలేకపోయేవాణ్ణి. బ్యాంక్‌నుండి రాగానే బాబు 'అంకుల్' అంటూ వచ్చేసేవాడు. బాబుని చూస్తూవుంటే ఎంతో సరదా అనిపించేది. తెల్లగా, బొద్దుగా వుండేవాడు. 'తల్లికితగ్గ బిడ్డ' అనుకోక మానరు చూసినవారెవరైనా.

> ### ఇదీ లోకం !
>
> 'బాబూ ధర్మం ...' అంటే
> 'కూలిపని చేసుకోవయ్యా'
> అంటారు ! ...
>
> 'పెట్టె పట్టమ్మంటారా' అంటే
> 'రిక్షా అయితే నేనూ పోవచ్చు'
> అంటారు ! ...
>
> 'రిక్షా కావాలా' అంటే
> 'సిటీ బస్సయితే చవక'
> అంటారు ! ...
>
> తీరా బస్సెక్కి
> కండక్టరు డబ్బులడిగేలోగా,
> తన స్టాపొచ్చి
> బాబుగారు మెల్లిగా జారుకుంటారు ! ...
>
> — కోరిమిల్లి సూర్యశంకర్

'నేను వచ్చి ఒక నెల అయింది. ఐ మీన్ నేను రెంట్ ఎంత పే చెయ్యాలో ...' అన్నాను తడబడుతూ ఒకరోజు లతతో.

'నిన్ను చూస్తూవుంటే రోజూ డేట్‌లు లెక్క పెడుతూ కూర్చుంటున్నట్టున్నావు. నీ దగ్గర నుండి రెంట్ తీసుకుని నేనేం మేడలు కట్టదలుచుకో లేదు. కావలసివస్తే నేనే అడుగుతాను. అంతేకాని దీనికోసం నువ్వు బెంగపడిపోయి నన్నొక కాబూలీవాలాని చేసేయ్యకు' అంది లత నవ్వుతూ. ఒక్కోసారి లత ఎంతో చలాకీగా మాట్లాడుతుంది. అటువంటప్పుడు ఆమెతో అలా మాట్లాడుతూనే కూర్చోవాలనిపిస్తుంది. కానీ ఒక్కోసారి ఆమె మూడ్ చాలా సీరియస్‌గా వుంటుంది. అప్పుడు ఆమెని పలుకరించాలంటేనే భయం కలుగుతుంది.

'లత రెంట్ తీసుకోవడంలేదు.' ఆ మర్నాడు వర్మతో అన్నాను.

'బహుశా తీసుకోదేమో ! ఆమెకి అవుసరం లేదు కూడా. ఆమె లోన్లీనెస్ కిల్ చెయ్యడానికి నేనే సజెస్ట్ చేసాను, ఆ రెండు రూమ్‌లు నీ కియ్యమని' అన్నాడు వర్మ.

అలా వుండాలంటే నా కిబ్బందిగా వుంటుంది అని చెప్పాను వర్మతో. చివరికి వర్మ సలహాపై ఆమె ఎకౌంట్‌లో నెలకి వందరూపాయలు క్రెడిట్ చెయ్యడానికి నిశ్చయించుకున్నాను.

* * *

మరో రెండు నెలలు గడచేసరికి నేను కూడా ఆ యింటి సభ్యులలో ఒకడిగా అయిపోయాను. ఏదో ఆత్మీయత మా ముగ్గురిలో అల్లుకుపోయింది. యింటికి రావడం లేట్ అవుతే, బాబు, లతా ఏక కంఠంతో అడిగేవారు 'ఎందు కాలస్యం అయింది' అని. లత రోజూ వాళ్ల ఆఫీస్‌కారులో వచ్చేసేది.

ఆ రోజు ఆదివారం. వారం అంతా ఆదరా బాదరాగా వురకలూ, పరుగులూ పెట్టే కలకత్తా వాసులకి 'ఆదివారం' అంటే 'హాయిగా గాలిపీల్చుకునే వారం' అన్నమాట.

పదిగంటలకల్లా మెస్‌లో భోజనం ముగించుకుని సరాసరి యింటికి వచ్చేసాను, లతతో కలసి ఏదైనా మాన్‌షోకి వెళ్దామని. ఆమె రూమ్‌లోకెళ్లాను. మంచంమీద పడుకుని యింటి కప్పుకేసి చూస్తూ ఏదో ఆలోచిస్తోంది. గుండెలమీద 'నెపోలియన్' పుస్తకం సగం తెరిచివుంది. తలకి స్నానం చేసి నట్టుగా వుంది. వదులుగా కట్టివున్న శిరోజాలు ఫ్యాన్‌గాలికి నాట్యం చేస్తున్నాయి.

నన్ను చూడగానే లేచి సర్దుకుని బెడ్‌మీదే కూర్చుంటూ 'ఊరకరాడు రవిబాబు.. ఏమిటి మహానుభావా ట్రిమ్‌గా తయారై వచ్చావ్ ?' అంది నవ్వుతూ.

'న్యూ అంపైర్‌లో 'చిత్‌చోర్' మాన్‌షో వుంది వస్తావా ?' అన్నాను. లతని 'నువ్వు' అని పిలుస్తూ కొద్దిరోజులైంది.

'యు ఆర్ ఆఫెన్ అవర్ లేట్ మై బాయ్. ఆయా బాబుని ఎక్కడికో తీసుకెళ్లింది. కీస్ తీసుకెళ్లిందో లేదో' అంటూ లేచింది లత.

నేను కొంత నిరుత్సాహపడ్డాను. "పోనీ ఎల్లుండి ఎలాగూ సెలవే కదా ! అప్పుడు వెళ్దాం" అన్నాను.

"ఫర్వాలేదు. తాళాలు బెనర్జీగారింట్లో ఇచ్చి వెళ్దాం. నువ్వు కూర్చో. క్షణంలో తయారై పోతాను." అంటూ డ్రెస్సింగ్ టేబుల్ దగ్గర కెళ్లింది.

ఆమె చదువుతూ వుంచిన 'నెపోలియన్' తిరగేస్తూ కూర్చున్నాను. 'ఎంతటివారైనా కాంతకి దాసులన్న నానుడికి నెపోలియన్ ఒక నిదర్శనం' అన్నాను. ఏదైనా ఒకపుస్తకం ఎవరైనా చదువుతూ వుంటే దానిగూర్చి కొంత చర్చించుకోవడం అలవాటైపోయింది.

'అవును పాపం. కోరి వివాహం చేసుకుని కూడా జొసెఫైన్ చేతిలో కీలుబొమ్మైపోయాడు' అంది ఆమె సానుభూతిగా.

కొత్తలో లత చరిత్ర విన్న తర్వాత ఆమె పట్ల ఏదో సానుభూతి ఏర్పడింది. తర్వాత ఆమెలోని నిండుదనం, ఆమె నిష్కల్మషమైన ప్రవర్తనా —

ఆమెపట్ల ఒక పవిత్రభావం ఏర్పరిచాయి. నిండు కుండలాంటి మనసు ఆమెది. ఎన్ని విఘాతాలనైనా చిరునవ్వుతో ఎదుర్కొనే సహనం ఆమెలో మూర్తీభవించి వుంది.

ఆడది అంటేనే అయస్కాంతం అంటారు. ప్రపంచంలోని ప్రతీ అందమైన వస్తువుని ప్రత్యేక శ్రద్ధతో ఏరి కూర్చి సృష్టించాడు భగవంతుడు లతని. ఆమె 'నాది కావాలి' అనే కోర్కె ఎప్పుడు మొదలైందో తెలియదు కాని, రాను రాను అది తీవ్రం కాసాగింది. నా ఊహలలోంచి బయట పడేసరికి లత రెడీ అయిపోయింది. మబ్బురంగు డ్రెల్లాన్ చీరలో పచ్చని శరీరం మెరిసిపోతోంది! ఇంతటి అందాల రాశి ప్రక్కన నడుస్తూ వెళ్లడం— నిజంగా క్రిందటి జన్మలో ఏదో పుణ్యం చేసు కుంటేనే కాని ప్రాప్తించదు. పాపం 'విమల్' ఎంత దురదృష్టవంతుడు ?!

'ఏమిటలా చిత్తరవైపోయావ్ ? టిక్కెట్స్ నేనే తీస్తాను' అంది నవ్వుతూ.

'అదేం కుదరదు. అలాగైతే నేను రాను' అన్నాను.

'పద నాయనా ముందు. ఆ విషయం హాలు దగ్గర చర్చించుకుందాం.' బేగ్ భుజాన తగిలించు కుంటూ అంది లత.

ప్రతీ ఖర్చూ ఆమె పెట్టడం నాకెంతో కష్టం అనిపించింది. బహుశా నేనొక మామూలు గుమాస్తాని కనుక ఆ ఖర్చుపెట్టే తాహతు నాకు లేదేమోనని ఆమె ఉద్దేశమేమో! ఆ మాటే అన్నాను ఆమె డోర్ లాక్‌చేస్తూ వుంటే. ఆమె షాక్ తగిలినట్టు ఫీలైంది నేనలా అనడం చూసి. 'ఛ! అవేం మాటలు రవీ. నిన్ను నువ్వు ఎందుకలా కించపరచుకుంటావ్ ? ప్లీజ్ అలా ఎప్పుడూ అనుకోకు.' అంది బాధతో నిండిన గొంతుతో.

'ఐ యామ్ సారీ లతా' అంతకంటే ఏమనాలో తోచలేదు.

'నో సారీస్. బి క్విక్. టైమైపోతోంది.' అంటూ పక్క వాళ్లింటివైపు త్వర త్వరగా నడిచింది.

* * *

సినిమా విడిచిపెట్టే సరికి మూడైంది. హాల్లోంచి బయటకొచ్చేసరికి వర్షం కుంభవృష్టిగా కురుస్తోంది. 'భీషన్ వ్రిష్టి' అనుకుంటున్నా రందరూ.

కలకత్తాలో పట్టుమని పది నిముషాలు కురిస్తే చాలు నగరం అంతా స్తంభించిపోతుంది. ఒకటి రెండూ బస్సులు వెళ్తున్నాయి. కాని ఇసుకేస్తే రాలనంత జనంతో నిండివెళ్తున్నాయి. నిచ్చెనలు పట్టుకుని వేళ్లాడుతున్నారు జనం. జన సమ్మర్ధం కాస్త పలుచగా వున్న ప్రదేశం చూసుకుని నిలబడ్డాం.

ఒక గంట.

రెండు గంటలు.

మూడు గంటలు గడచిపోయాయి. అలాగే నిలబడ్డాం ఏదైనా వాహనం దొరుకుతుందేమోనని. 'సారీ లతా, నా వల్లనే నీకీ ట్రబుల్ కలిగింది' నేను చాలా బాధపడ్డాను.

'ఈ మహానగరంలో బతకాలంటే యిటు వంటివి భరించక తప్పదు. మధ్య నువ్వెందుకు బాధపడడం' నిబ్బరంగా అంది ఆమె.

ఆరున్నర కావస్తూంటే ఇక టాక్సీలమీద ఆశ వదులుకుని 'షియల్దా' స్టేషనుకి బయలుదేరాం. మోకాలి నీటిలో కుంటుకుంటూ నడుస్తూ షూస్ ఒక చేత్తో, మోకాళ్లవరకూ ఎత్తిపట్టుకున్న కుచ్చెళ్లనొక చేత్తో. నడుస్తున్న లతని చూస్తూ వుంటే నా మనసు విలవిల లాడిపోయింది.

బాలీగంజ్ స్టేషనులో దిగి ఇంటికి చేరేసరికి రాత్రి పదైంది. ఆయా, బాబూ నిద్రపోయారు. లతా, నేనూ కలిసి భోజనం చేసాం.

పడుకున్నానన్న మాటేగాని నిద్రరాలేదెంతకీ. ఏదో కావాలన్న తపన మొదలైంది నాలో. తడిసిన లత శరీరం కళ్లఎదుట మెదిలేది.

కోరికలకి లోబడ్డ మనిషి మంచీ, చెడూ గుర్తించే విచక్షణాజ్ఞానానికి దూరంగా విసిరివేయ బడతాడేమో! మెల్లగా నడుస్తూ లత గదివైపు నడిచాను. లత నిజంగా నన్ను ప్రేమిస్తోంది. ఈ సమయంలో నా కోరిక కాదనదు. గది తలుపు లోపలనుండి బోల్ట్ చేసిలేదు. మెల్లగా తెరిచాను. నైట్ బల్బ్ వెలుగుతోంది. పలుచటి నీలం రంగు గదంతా నిండివుంది. లేత నీలం రంగులో లత శరీరం ఎంతో ఆకర్షణీయంగా వుంది. పైట పూర్తిగా తొలగిపోయి వుంది. బాబు ఆమె పొట్ట మీద చెయ్యివేసి నిద్రపోతున్నాడు. విపరీతంగా అలసి వుండడం వలన ఆదమరచి నిద్రపోతోంది లత. నాలో ఏ మూలో మానవత్వం మేలుకొంది. 'ఛ! యింత అమాయక ప్రాణికా అపకారం చెయ్యబోయేది?' లత నిజంగా నన్ను ప్రేమిస్తోంది. 'నువ్వు నా దానివైన తరువాతే నీ పక్కన చేరుతాను లతా!' అనుకుని అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చి నా మంచంమీద వాలిపోయాను.

* * *

చెల్లాయి పెళ్లి రెండు రోజులుంది. లతకి ఇన్విటేషన్‌తోపాటు ఉత్తరం కూడా రాసాను బాబుకి తండ్రినయ్యే అదృష్టం ప్రసాదించమని. ఉత్తరం పోస్ట్ చేసిన తర్వాత తృప్తిగా నిట్టూర్చాను. నాలో చాలా కాలమై రేగుతున్న తుఫాను భీబత్సవం తగ్గింది. లత జవాబుకోసం ఆతృతగా ఎదురు చూస్తున్నాను.

* * *

"నీకో లెటర్ వచ్చిందిరా అన్నయ్యా!" అన్న చెల్లాయి పిలుపుతో వాస్తవంలోకి వచ్చాను. చీకటి పడింది. "నాన్న టౌన్ వెళ్తూ ఉత్తరాలు తీసు కున్నారట. యిప్పుడు తెచ్చారు. యింత చీకటి పడే వరకూ ఒక్కడివీ ఏం చేస్తున్నావ్ ?" అంది చెల్లాయి ఉత్తరం అందిస్తూ.

ఆ కవరు లత దగ్గరనుండి వచ్చినదే! ఇంటికి చేరితేకాని చదవడం కుదరదు. "అరే! ఎంత చీకటి అయిపోయింది ? చల్లటిగాలి వీస్తోంది కదూ! చిన్న కునుకు పట్టేసింది" అన్నాను కొంచెం గిల్టీగా.

ఇంటివైపు నడుస్తూవుంటే అడుగులు తడబడుతున్నాయి. యింకొద్ది సేపటిలో నేను హిమాలయా శిఖరాన్ని అధిగమించిన అనుభవాన్ని పొందుతానో లేక పాతళంలోకి కృంగిపోతానో !?

అల్లకల్లోలంగా వున్న మనసుని అదుపులోకి తెచ్చుకుంటూ వణుకుతున్న చేతుల్తో ఉత్తరం చించాను. ముత్యాల సరాల్లాంటి అక్షరపంక్తులను ఆతృతగా చదవసాగాను.

"రవీ,

'అంకుల్ వుత్తరం రాసాడా నానీ' అంటూ ఎంతో సంబరంగా తెరిచిన నీ ఉత్తరం చూసి ఎంత బాధపడ్డానో నువ్వు ఊహించలేవు. ఇది నువ్వు రాసిన ఉత్తరమంటే ఇప్పటికి నమ్మకం కుదరడం లేదు. భరింపరాని ఈ నగ్నసత్యం అబద్ధం అయి వుంటే ఎంత బాగుండేది!? ఎంతో అమాయకంగా, ఏమి ఎరుగని వాడిలా వుండే నువ్వు ఎందుకిలా రాసావ్. నా అన్న వాళ్లందర్నీ పోగొట్టుకుని ఒంటరి జీవితాన్ని దుర్భరంగా గడుపుతున్న నేను చిన్న తనంలోనే పోగొట్టుకున్న తమ్ముణ్ణి నీలో చూసుకుని సంబరపడుతున్న నాకు యిటువంటి వరుస పెడతావా?

ప్రేమా, గీమా అంటూ — ఛీ, ఎన్ని రాసావ్! ఎక్కడ నేర్చావోయ్ యివన్నీ ? స్త్రీ, పురుషుల మధ్య వుండవలసింది ఒక నీవూహించిన ప్రేమ మాత్రమేనా ? ప్రేమించే హక్కు నీకు లేదనను. కానీ ... రవీ, అందుబాటులో వున్నదానిని ప్రేమించాలి. నా జీవితంలో సర్వం 'విమల్'కి అర్పించాను. ప్రస్తుతం నా చుట్టూ గిరి గీసుకుని బ్రతుకుతున్నా. యిక ఆ గిరి దాటి ఎవ్వరూ ప్రవేశించలేరు.

నువ్వు అనుకుంటున్నది ప్రేమ అనిపించుకోదు రవీ. మోహం! కాకపోతే కామం!! అది శాశ్వతం కాదు.

నీలాగా ఎందరో అన్నారు. కాని ... కాని వాళ్లలా నువ్వు కూడా ... యిక అనవసరంగా పొడిగించడం నా కిష్టంలేదు. నేనూ, బాబూ డార్జిలింగ్ వెళ్తున్నాం. వచ్చేసరికి ఒక నెల రోజులౌతుంది. ఈలోగా వచ్చేసి రూమ్‌లు రెండూ ఖాళీ చేసి వెళ్లిపో. తిరిగి కలుసుకోడానికి ప్రయత్నం చెయ్యకు.

నీ పరిచయం ద్వారా మరో పాఠాన్ని నేర్చు కున్నాను, ప్రతీవారిని నమ్మకూడదని. ఇంకా యిటు వంటివి ఎన్ని ఎదురౌతాయో!

గుడ్ బయ్.

లత." ★

ప్రైవేట్ ఫరమ్‌లో రిసెప్షనిస్ట్‌గా పని చేస్తోంది. అమ్మ ఎందుకో మరీ హీనంగా ఆమె గురించి మాట్లాడింది. కాని, ఆ అమ్మాయి అమ్మ చెప్పినంత ఘోరంగా మాత్రం వుండదు. నాన్నగారు, మీరు ఒకసారి చూస్తే ..."

"సీతకి వనితకీ ఎక్కడ సాపత్యం ? నక్కకి నాగ లోకానికి వున్నంత తేడా ! వనిత చాలా స్మార్ట్‌గా వుంటుంది. అసలు సీత నీకెలా వచ్చిందో అర్థం కావటంలేదు. నువ్వు ఆ అమ్మాయికి పెళ్ళి చేసుకుంటానని ప్రామిస్ చేశావా ?" అంది అమ్మ ఆతృతగా!

"లేదు."

"థాంక్ గాడ్ ! మరేం ఫరవాలేదు. ఈ వయస్సు పిల్లలకు ప్రేమ ఒక అడ్వెంచర్ లే. మాట్లాడకుండా నాన్నగారు చెప్పిన సంబంధానికి సమ్మతి తెలియచెయ్యి."

"లేదమ్మా ... నేను పెళ్ళి చేసుకుంటే సీతనే పెళ్ళి చేసుకుంటాను."

"చంద్రం !" నాన్నగారి గొంతు ఖంగున మ్రోగింది. "చాలా పెద్దవాడివైయ్యావు. నిన్న మొన్నటిదాకా ఎలాంటి బట్టలు

# ప్రేమ తీర్థం

[29 వ పేజీ తరువాయి]

వేసుకోవాలో తెలియని వాడివి, ఈవాడు భార్యను సెలెక్ట్ చేసుకొనేంత ఎదిగావన్న మాట. భేష్. అయితే ఒక్కమాట. నువ్వు అంత ఖచ్చితంగా నీ నిర్ణయం చెప్పినప్పుడు, ఈ విషయంలో మా నిర్ణయం కూడా నువ్వు వినటం మంచిది. నీ ఇష్ట ప్రకారం నువ్వు సీతనే చేసుకునేట్లైతే తక్షణం ఇంట్లో నుంచి వెళ్ళిపోవచ్చు. ఆ క్షణంతో నీకు మాకు ఎలాంటి సంబంధం వుండదు. నా ఆస్తిలో నయాపైసా కూడా నీకు ఇవ్వను. ఇది బెదిరింపనుకో మరేమైనా అనుకో, నా నిర్ణయం మారదు" అంటూ కోపంగా కూర్చున్న కుర్చీని ఒక్కసారి వెనక్కు తన్ని వెళ్ళిపోయారు.

"అమ్మా ! ఇందులో నేనంత కాని పని ఏం చేస్తున్నానో అర్థం కావటంలేదు. సీత బీదపిల్ల కావచ్చు. మనకున్న ఆస్తిపాస్తులు చాలావా ? నేను పెళ్ళి చేసుకోబోయే అమ్మాయి నాకు నచ్చటం, ముఖ్యం కాదా. నాన్నగారిక్కి మనస్సైనా ..."

"నా మాట నువ్వు విన్నావు కమలా, ఆయన వింటానికి. అయినా ఈ విషయంలో మీ నాన్నగారి నిర్ణయమే నా నిర్ణయం. రేపు వనితవాళ్ళ నాన్నగారు అడిగితే ఆయన ఏం చెబుతారు. నాన్నగారన్న అభిమానం వుంటే ఈ పెళ్ళికి ఒప్పుకో ..."

"అమ్మా ! ప్లీజ్. ఈ ఒక్క విషయం నేను వినలేను. మొదటి నుంచి మీ మాటే విన్నాను. నేను ఎమ్. బి. బి. ఎస్.లో చేరుతానంటే, కాదు అని ఎమ్. టెక్ చదివించారు. మీ దగ్గరుండి చదువుతానన్నా వినకుండా ఎక్కడో బొంబే పంపారు. అన్నీ మీ ఇష్టమే, కాదన్లేదు అప్పుడు. కాని ఇది నా భవిష్యత్తుకు సంబంధించింది. అమ్మా... ఐ వాంట్ సీత, వెరీమచ్."

"సరే, నీ ఇష్టం ... మా కంటే ఆదే నీకు ఎక్కువైంది. ఆ అమ్మాయినే పెళ్ళి చేసుకో. ఇక ఆలోచన ఎందుకు. మాకు పిల్లలే పుట్టలేదనుకుంటాం" అమ్మ ఒక పురుగును చూసినట్లు చూసి, వెళ్ళిపోయింది.

(ఇంకా ఉంది)

# బొమ్మల మహాభారతం — భారత యుద్ధం — మండపాక సీతారామాంజనేయ

( గత సంచిక తరువాయి )













[ఇంకా ఉంది

# కొసరు

చెల్లూరి సీతారాజేశ్వరరావు




ివజోగి టేబిల్ మీది ఫైల్స్ చూసి కంగారు పడిపోడు. వాటి సంఖ్య పెరిగితే తడికి ఆనందం. అవతలి వారికి ఆతృత. ఒక ళ ఆఫీసరు పిలిచి అడిగినా ఫైలులోని విష యాల మీద లక్ష సందేహాలు వెలిబుచ్చుతాడు. ఫెన్సుగ్గా జీవోలు వాడుకుంటాడు. ఆఫీసర్లు యాగనోము పడతారు. శివజోగి చేతిలో ఏ యినా పడితే (భారతీయ కరెన్సీ మాత్రమే) ఫైలు నడుస్తుంది. కాదు పరుగెడుతుంది.

ఆ రోజు అయిదువందలు చేతిలో పడి ాయి. అయిదు గంటలకి, యింకా యిరవై ముషాలుంది. శివజోగికి ఆఫీసులో కూర్చో ుద్ధికాలేదు. పర్మిషను తీసుకుని యింటికి డిచాడు. దారిలో మామిడి పళ్ళు కనపడి ాయి. గీచిగీచి డజను బేరమాడి పుచ్చుకు న్నాడు.

"కాయలంత బాగోలేదు. ఈ చిన్న కాయ వెయ్యి," శివజోగి మరో కాయతీసుకుని సంచిలో పడేసుకున్నాడు.

"అసలే నష్టం బాబూ. కొసరు ప్రాణం తీస్తుంది. ఆ బాధ మీకు తెలియదు బాబూ!" పళ్ళు అమ్మే తాత బాధ పడ్డాడు.

శివజోగి నవ్వుకుంటూ సైకిల్ ఎక్కాడు. అతడికి చాల ఆనందంగావుంది. ఈ అయిదు వందలు కూడ వడ్డీకి యిచ్చేస్తే మొత్తం పదకొండు వేలవుతుంది. శివజోగి గుట్టు మనిషి. తన సీటు ప్రతిభ యింట్లో చెప్పడు. సంపాదన ఎక్కువయిందని తెలిస్తే ఖర్చు పెరిగిపోతుంది. తను నిర్వాకస్థుడు కావాలి.

పైగా విధవ అప్పగారు, ఆమె కొడుకు భవాని తన మీద ఆధారపడి వున్నారు. సంసారానికి ఖర్చు పెట్టేయడం అతడికిష్టముండదు.

శివజోగి యింటికి రాగానే ముఖం కడుక్కుని లుంగి చుట్టుకుని కూర్చున్నాడు. నాగమణి టీ యిచ్చింది. భార్య చెబుతున్న కబుర్లు వింటూ కూర్చున్నాడు పెరటి అరుగు మీద. హఠాత్తుగా అతడికి గుర్తు వచ్చింది, జేబులోని అయిదువందలు బీరువాలో పెట్టలేదని.

గదిలోకి వచ్చాడు. ఫ్యాంటులో పర్సులేదు. గుండె జిల్ మంది. అటుయిటు వెతికాడు. లేదు. ఇంటి దాకా జేబులో వుంది. అంతలో ఎక్కడ పడింది?

" ఏమిటండీ వెతుకుతున్నారు? " నాగమణి అడిగింది.

"పర్స్ పడిపోయింది."

"ఎంత వుంది?" ఆందోళనగా అడిగింది దగ్గరకి వచ్చి.

నిజం చెబితే వీల్లేదు. నెలాఖరి రోజులు " యాభై " అన్నాడు.

కాస్సేపటికి అప్పగారు భవానితో వచ్చింది "ఇదిగోరా తమ్ముడూ నీ పర్స్. సైకిల్ పెట్టే వరండాలో పడిపోతే, భవానికి దొరికింది. చూసుకో డబ్బు వుందో లేదో! "

నాగమణి పర్సు తీసి చూసింది. తొమ్మిది అయిదులు, అయిదు ఒకట్లు. "సరిగ్గానే వుందండీ. మనసొమ్ము గట్టిది. యాభయ్యీ వుంది. మనవాడికి దొరికింది కనుక సరిపోయింది. "

శివజోగి ముఖం బొగ్గులావుంది. అందులో అయిదు వందలు వుండాలి. యాభై వుండట మేమిటి? పడేసుకుంటే పూర్తిగా పోవాలి కదా! ఇప్పుడు నిజం చెప్పినా లాభం లేదు. నమ్మరు.

## అ భే ద ం

పచ్చదనం పరికించు పక్షికి
ఏ చెట్టుపైనా దూషణలేదు
సర్వమత సారం తెలిసిన వానికి
ఏ మతం పైనా కినుక లేదు.

\- బద్వేలి రమేష్

# సూపర్ రిన్‌తో తళతళలాడే తెలుపు

## మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే తెలుపు

మీ బట్టలకు కళ్లు తిప్పుకోలేనంత తెల్లదనం—క్రమం తప్పకుండా సూపర్ రిన్‌తో ఉతికితే వాటి తెల్లదనం అద్వితీయం. మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే మరింత తెల్లటి తెలుపునిస్తుంది సూపర్ రిన్. ఎందుకంటే, సూపర్ రిన్‌లో తెలుపు చేసే శక్తి ఎక్కువ.




దీని తెలుపు చేసే శక్తిని మీకు మీరే
ఋజువు చేసుకోండి :

మరే ఇతర డిటర్జంట్ బార్‌తోనైనా ఉతికినది





సూపర్ రిన్‌తో ఉతికినది

సూపర్ రిన్‌లో తెలుపు చేసే శక్తి ఎక్కువ

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పాదన

లింటాస్-RIN. 35-2316 TL

మీకెందుకండీ శ్రమ! ఫోటోలో నేను వేశావాన్లేగదా!

కటూర్

# కొసరు

"ఇంకా అలా ముఖం వ్రేలాడేసుకుంటా వేంరా? డబ్బు దగ్గర జాగ్రత్తగా వుండాలి!" అప్పగారు వెళ్ళిపోయింది.

శివజోగి మడత మంచం మీద నిస్తేజంగా పడుకున్నాడు. అంతా అశాంతిగావుంది. బంతి ఆడుకుంటున్న భవాని దగ్గర కెళ్ళి "అందులో యింకా వుండాలిరా డబ్బు? ఏం చేసావు చెప్పు?" గద్దించాడు.

"నాకు తెలియదు మామయ్యా!"

"నిజం చెప్పు!" చెవి పట్టుకున్నాడు.

వాడు పెద్ద రాగం తీశాడు. అప్పగారు, భార్య వచ్చేశారు. "అందులో యింకా డబ్బు వుండాలిటే అమ్మా! నేను తీశానంటున్నాడు మామయ్య!"

"ఇంకా వుంటే యాభై అనే ఎందుకు చెబుతావు? డబ్బు చేదా? నీ మీద పడివుంటున్నానుని దొంగల్ని చెయ్యకు? అయినా అంత డబ్బు ఎక్కడిది నీకు?"

అప్పగారి నోరు పెద్దది. సమాధానం చెప్పలేక వెర్రిగా నవ్వి "వుత్తదే... సరదాకన్నాను. నవ్వుతూ కోప్పడితే ఏడ్చేస్తున్నాడు" అన్నాడు.

'భవానికో రూపాయి యివ్వండి. పర్సు బంగారు తండ్రిలా తెచ్చాడు.' అన్నది నాగమణి.

శివజోగి ఏడుస్తూ యిచ్చాడు. 'కొసరు' బాధ అప్పుడు తెల్సింది అతడికి.

## ఫెళ్ళని డైరి

## ఉప్పుతో కాఫీకి రుచి !

ప్రతి వాళ్ళూ కాఫీ త్రాగుతారు. కానీ కాఫీ తయారు చేయడంలో, చక్కగా తయారు చేయడంలోనూ అందె వేసిన చేయి గలవారెం దరున్నారు? మీ కాఫీ ఎంచక్కని రుచి కలిగినదై వుండాలంటే కాఫీ తయారై అది గ్లాసులో పోశాక కొంచెం వుప్పు ఆ గ్లాసులోని కాఫీలో కలపండి. కాఫీకి బ్రహ్మాండమైన రుచి వస్తుంది. ఈ వుప్పు ఏ మాత్రం ఎక్కువైనా "యింతే సంగతులు", కాఫీలో నే గాక, టీ లో కూడా యిలా వుప్పు (మెత్తని ఉప్పయితే చాలామంచిది) కలిపితే ఆ టీ కూడా బ్రహ్మాండంగా వుంటుందని వో పత్రిక వివరించి, చదువరీ ఉప్పు కలపడంలో ఉషారుగా వుండు అని హెచ్చరించిందట. మీ కాఫీలో ఉప్పెంతసార్!

## మూర్ఖ మహాసభ !

ఇటీవల భువనేశ్వర్‌లో ఒక కొత్త రకం మహా సభ జరిగిందట. దాని పేరు మూర్ఖ మహాసభ అట. ఈ మూర్ఖ మహాసభకు రాజబాబు అనే రాజకీయపార్టీ ప్రముఖుడు అధ్యక్షత వహిస్తే ఆయనకు "మూర్ఖ శిరోమణి" అని బిరుదు నిచ్చి సత్కరించారట. ఈ సభలకు ప్రాంతీయ మూర్ఖ సంఘ అధ్యక్షులు పలువురు హాజర య్యారట. సభలకు హాజరయిన వారికి కూడా గౌరవ బిరుదులిచ్చి సత్కరించిందట యీ మహాసభ. . . . ఈ సభకు పిలుపొస్తుందా, లేక ఎవరంతట వారే తమ అర్హత కనిపెట్టి వెళ్ళి హాజరవ్వాలా?!

## భర్తని హత్యచేసిన ఖైదీకి రాఖీ !

అహమ్మదాబాద్‌లో తన భర్తను దారుణంగా చంపి జైలులో శిక్ష అనుభవిస్తున్న ముంతాజ్ అలీ అనే హంతకునికి ప్రవీనాల అనే ఆమె రక్షా బంధన్ పండుగ నాడు రాఖీ చేతికి కట్టి అతన్ని ప్రేమతో అన్నా! యికనైనా చక్కగా, మంచి వాడిగా మెలిగి, జైలు శిక్ష త్వరగా పూర్తిచేసుకు యింటికి రమ్మని అన్నదట. తన భర్తను చంపిన వానిని అన్నగా ఎంచి రాఖీ కట్టిన యీ దృశ్యానికి జైలు అధికారులకీ కళ్ళు చమర్చాయట.

## కారణం తెలియని ఆత్మహత్య !

మద్రాసు ఎగ్మూరు పోలీసు స్టేషనుకు చెం దిన కంట్రోలు రూములో పని చేస్తున్న యువ రాజా అనే అతను 11 వ తేదీ రాత్రి డ్యూటీచేసి, పొద్దున్నే యింటికివచ్చి టిఫినుతిని పడుకున్నాడట. మధ్యాహ్నం అన్నం తిని మళ్లీ పడుకున్నాడట. అతని భార్య సరస్వతి సాయంత్రంఅయిదింటికి స్కూలు నుంచి పిల్లలను పిలుచుకు వచ్చి తలుపు తడితే అతను తీయలేదట. గాఢ నిద్రలో వున్నా డేమోనని మరో గంట గడిచాక యిహ నైట్ డ్యూటీ కాతను వెళ్ళడానికి వంట ఆరంభించాలని తలుపు బాదిందట. ఎంత బాదినా ప్రయోజనం లేక పోయేసరికి భయంతో తలుపు విరిగేలా బాదిం దట. లోపల ఫ్యానుకు నైలాను చీర కట్టి ఆ చీర ముడిలో మెడ వేలాడుతూ యువరాజా శరీరం వ్రేలాడుతోందట. యువరాజాకు, సరస్వతికి ముగ్గురు మగపిల్లలూ, వో ఆడపిల్లానట. యువ రాజా ప్రభుత్వ ఆసుపత్రిలో పని చేస్తున్న సత్యకళ అనే ఆమెను రహస్యంగా పెళ్ళి చేసుకున్నాడట. ఆమెకూ అతనికీ వో కూతురుట. ఇంతకూ ఆతని ఆత్మ హత్యకు కారణం తెలియలేదట.

# వారఫలం

## 17-10-1980 శుక్రవారం మొదలు 23-10-1980 గురువారం వరకు

మేషం : ముఖ్య గ్రహాలన్నీ మీకు ఉపయోగకరమైన, లాభదాయకమైన, ఫలదాయకమైన స్థానాల్లోనే ఉన్నాయి. ఒక్క మాటలో చెప్పాలంటే రాశికి ఆరింట గల శని — గురువుల వలన వ్యాపారం స్థిమితపడుటకు, పాత బాకీలు వసూలగుటకు, చిత్ర రంగ వ్యాపారం బాగా సాగుటకు. స్త్రీలకు: చాల మందికి చేస్తున్న ఉద్యోగంలో పెంపు, అధిక విద్యార్జనకు అవకాశాలుండగలవు.

వృషభం : ఆరోగ్యం బాగుంటుంది. అనుకున్న కార్యాలలో విజయమున్నది. నూతనంగా నగలు చేయించే అవకాశమున్నది. ముఖ్య బంధువుల నుండి ఉత్తరాల మూలాన ఒకానొక ముఖ్య విషయమై, శుభవార్త అందగలదు. అంటే సర్వవిధాలా శుభదాయకమైన వారమని అర్థం. స్త్రీలకు : సమాజంలో గుర్తింపు, సంఘసేవా పరాయణత్వం, ఉద్యోగంలో పెంపు సంభవం.

మిథునం : చాల దినాలుగా కానిపనులు, చటుక్కున నెరవేరే మార్గమున్నది. లాయర్లకు, వైద్యవృత్తి నవలంబించిన వారికి, కంట్రాక్టుదారులకు అనుకూల ఫలమ్ములందగలవు. వ్యాపారంచేసే వారు వెనుకు ముందు లాలోచించి, కార్యరంగంలో దిగాలి. క్రొత్త సరుకు కొనుగోలు చేయగలరు. స్త్రీలకు: వ్యవసాయానుకూలత, ప్రయాసలేకుండా కార్య విజయం చెప్పతగియున్నది.

కర్కాటకం : మిత్ర సహాయమున్నది. కుటుంబానందం సమకూడుతుంది. ఆరోగ్యలోపం కనిపిస్తుంది. పోటివారి పోటీ హెచ్చుటుంది. చాలమంది సహకారంవలన, మీ వృత్తిలో పెంపు సమకూడి, సంఘముచే గుర్తింపు, పెంపు సమకూడగలదు స్త్రీలకు : సంతానంవలన, వారి యభివృద్ధి వలన, మీకు ఆనందమున్నది. దూర ప్రయాణం చేయవలసి రావచ్చు.

సింహం : మీరు కోరనిదే ఇలా చేయండి, అలా అనుసరించండి, అని లేనిపోని సలహాలిచ్చి, పనులను చెరిచే వారుంటారు. హితులని మోసపోకండి. స్తోత్రప్రియులను దరిచేర్చకండి. సమయానుకూలంగా, కూలంకషంగా, ఆలోచించి, వ్యాపారానికి దిగాలిగదా! స్త్రీలకు : ధనాదాయం, నూతనవస్తు సేకరణ చెప్పదగియున్నది.

కన్య : ఉద్యోగంలో మార్పురాగలదు. మీసేవను అధికారులు గుర్తించగలరు. మీ ఆలోచనలు ఫలించగలవు. మీ కుటుంబ సభ్యుల ఆరోగ్యం జాగ్రత్తగా చూడాలి. ఔషధ సేవ ముఖ్యమని అనిపించేవారం. ఉత్సాహవంతులకు క్రీడారంగంలో అధికంగా అవకాశాలు చిక్కే మార్గమున్నది. స్త్రీలకు : ఆరోగ్యం చూచుకోవాలి. రాబడి ననుసరించియే ఖర్చు చేయాలి. అధిక వ్యయం సూచింపబడే వారం.

తుల:— నిత్య కృత్యంగా చేసే వృత్తిలో పెంపు కలదు. ఆదాయానికి లోటు లేదు. ఎటొచ్చి అధిక వ్యయం మాత్రం చెప్పదగినవారం. కాయకష్టం చేసికొనే వారికి, నూతన మార్గాలలో ఆదాయం చెప్పదగియున్నది. అవివాహితులకు, శుభకార్యానుకూలత గలదు. ఉద్యోగంలో చాలమందికి నూతనావకాశాలుంటాయి. స్త్రీలకు: అయిన వారివలన, మిత్రుల వలన ఆదరణ, లాభం, సహాయం, ఆదాయం కూడ ఉండగలదు.

వృశ్చికం:— లేని పోని ప్రసావనలకు చోటివ్వకపోయినా, ఏదో ఒక యిబ్బంది ఉంటుంది. చాల కాలంగా నిలచి పోయిన బాకీలు వసూలయ్యే మార్గమున్నది. కుటుంబానందం గలదు. సంతానం వలన సంతోషం, విశ్రాంతి చెప్పదగిన వారం. తీర్థ యాత్రా ప్రసావనలుండగలవు. పుణ్య కార్యాచరణకు అనుకూలమైన వారం. స్త్రీలకు: అన్ని రంగాలలోనూ నూతనావకాశాలుండ గలవు. ఆరోగ్యలోపం రాదు. వినోద కార్యక్రమంలో పాల్గొనగలరు.

ధనుస్సు:— మీరు విరివిగా వ్యాపారం నిమిత్తమై ప్రయాణించనున్నారు. ప్రయాణంలో ప్రమాదం సంభవించే అవకాశమున్నది. ముఖ్యంగా వాహన ప్రమాదం అనటానికి కూడా వీలున్నది. మరొక మాట. వస్తు సేకరణలో కూడా మోసపోవటం జరుగవచ్చు. కాస్త జాగ్రత్త అవసరం. స్త్రీలకు: ఉద్యోగంలో పెంపు, క్రీడారంగంలో చాలమందికి అవకాశాలుండ గలవు.

మకరం:— రాశికి గ్రహానుకూలత, ఒక్కఏడాది కాలం పాటు లేనిది, యికనుండి అనుకూలంగా సంభవింపనున్నది. 'శని, గురు' గ్రహాల మూలాన పరిపూర్ణంగా సత్ఫలములందుకోగలరు. అన్ని రంగాలలో మీకు లాభదాయకమే. స్త్రీలకు: ఇంటిలో జరుగబోవు శుభ కార్యాలను గూర్చిన హడావుడి, నూతన వస్తుసేకరణ, నగలు కొనే అవకాశముండ గలదు.

కుంభం:— మీకు చాలినంత అవకాశంవ్యాపార విషయంలో చెప్పదగియున్నది. భారీ వ్యాపారం బాగా సాగే అవకాశముంటుంది. జాయింటువ్యాపారములో యిబ్బందులు రాగలవు. అనవసరంగా ధన మూలమైన చిక్కులలో చిక్కరాదు. ఉద్యోగస్తులకు చాలమందికి ఈ వారం 'ప్రమోషన్'కు అవకాశాలుండ గలవు. స్త్రీలకు: నగలు కొనటమో, చేయించటమో, బంధువులతో కలయిక, క్రీడా రంగంలో అవకాశాలుండ గలవారం.

మీనం:— ఉత్తమ వార ఫలముంటుంది. అయినా, మీ సంభాషణ మూలాన, మీ ప్రవర్తన మూలాన, కొంత యిబ్బంది, పరుల అయిష్టత కొని తెచ్చుకోగలరు. వ్యాపారం సామాన్యంగా సాగుతుంది. అధిక లాభమాశింపరాదు. స్త్రీలకు: విద్యావిషయంలో పెంపు, విలువ గల వస్తుసేకరణ, చాలమందికి సభాగౌరవం చెప్పదగిన వారం.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి



# ప్రవేశపెడుతోంది

# కొత్త

# బోనస్ బనియన్



**సుఖ అనుభూతి**
**ఎక్కువ మన్నిక**
**తక్కువ ధర**

వి ఐ పి బోనస్ ఎక్స్‌ట్రా-ఫైన్ బనియన్. 'వైటెక్స్', 'సాఫ్టెక్స్' పద్ధతుల తాలూకు ప్రయోజనాలన్నీ ఇప్పుడు అనువైన ధరల్లో. సుఖానుభూతి కోసం తొడుక్కోండి వి ఐ పి బోనస్ బనియన్—భుజాలూ, చేతులూ సాగిపోవు. అందం కోసం, మన్నిక కోసం ఇది మెర్సెరైజ్డ్ దారంతో కుట్టబడింది.

**హెచ్చు ధర**
**లేకుండానే**
**హెచ్చు మృదుత్వం**



శ్రేష్ఠమైన లోతొడుగుల కల్పనలో
అందెవేసినవారు

CASHH-3 234 TEL

ధ్రప్రదేశ్ డిస్ట్రిబ్యూటర్సు : మహవీర్ ఏజన్సీస్, 4-1-938, తిలక్ రోడ్డు, హైదరాబాద 500001.

## హైదరాబాద్ నోట్‌బుక్

### పెరుమాళ్ల గుండాచార్యులు :

ప్రౌఢ దేవరాయల కాలంలో దక్షిణ దేశం నుండి కనులాపురానికి [ఆనాటి విజయనగరానికి] వలస వచ్చిన వైష్ణవ కుటుంబాలలో ఒకటి పెరుమాళ్ల కుటుంబం. వైష్ణవ దేవాలయాలలో దివ్య ప్రబంధ వేదాధ్యయనాలు ఈ కుటుంబం విధులు కనక పెరుమాళ్ల అనే ఇంటి పేరు వచ్చింది. విజయనగర సామ్రాజ్య పతనానంతరం ఈ కుటుంబం మరికొన్ని వైష్ణవ కుటుంబాలతో పాటు సురపుర రాజ్యానికి వలస వచ్చింది. సురపురం రాజ్యం కృష్ణా భీమానదుల మధ్యనగల మహా సారవంతమైన రాజ్యం. విజయనగర —బహమనీ రాజ్యాల మధ్యన ఉన్న బఫర్ రాజ్యం. ఈ సారవంతమైన భూమిపై పెత్తనం కోసం విజయనగర బహమనీ సామ్రాజ్యాలు కొట్టుకొని చచ్చాయి. సురపురం రాజులు తెలుగు వారు. విష్ణుభక్తులు. కనుక విజయనగరం నుంచి 1788లో వలస వచ్చిన వైష్ణవ కుటుంబాలను ఆదరించారు. వారి ఆదరానికి తగినట్టుగానే ఆ వైష్ణవ కుటుంబాలు న్యాయ వేదాంత మీమాంసల లోను, తెలుగుసాహిత్యంలోను అపూర్వ రచనలుచేసి తమఋణం తీర్చుకొన్నాయి. సురపురం వేంకటాచార్యులు,బుక్కపట్నం శ్రీనివాసాచార్యులు, ఆచార్యుల వేంకటాచార్యులు మున్నగు మహావిద్వాంసులు సురపురం వారే. పెరుమాళ్ల వంశంలోను గొప్ప మహనీయులు అవతరించారు. వారిలో వేంకటాచార్యుల, ఘనాంతస్వాధ్యాయి, శ్రౌతస్మార్తాలలోని పుణులు తపస్వులు,నిష్ఠాగరిష్టులు. [illegible]గవతంపన్నెండు స్కంధాలు వారికి వాచో [illegible]ం. భాగవతం వేంకటాచార్యులనే వారికిపేరు [illegible]హిత్యరాట్ అని కూడా వారికి బిరుదు. ఆయనకుమారులు శ్రీ గుండాచార్యులు. పలువురు పిల్లలు మరణానంతరం పుట్టడంవల్ల ఈయనకు గుండాచార్యులు అని పేరు పెట్టారు. జననం 1908 డిసెంబర్‌లో. 20 సంవత్సరాల వరకు శ్రౌతస్మార్తాలతో పాటు వేదాధ్యయనం సంహిత నాటకాంత సాహిత్యం పూర్తి చేసారు. ఆయన ప్రతిభకు మెచ్చి 1928లో విద్యా భూషణం బిరుదిచ్చారు. అప్పటికి ఇంగ్లీషు నేర్చుకుందామనే బుద్ధి పుట్టింది గుండాచార్యులకు.సురపుర [గుల్బర్గా జిల్లా] అప్పుడు నిజాం రాజ్యంలోది గనుక ఉరుదూ మీడియంలో ఆంగ్లం ప్రారంభించి, రెండు సంవత్సరాలలో ప్రైవేటుగా ప్రీమెట్రిక్, మెట్రిక్ చదివి, మెట్రిక్ ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులై, ప్రభుత్వ విద్యార్థి వేతనంతో హైదరాబాద్‌లో ఇంటర్ మీడియేట్ చదివారు. అప్పుడింకా ఉస్మానియా విశ్వవిద్యాలయం నిర్మాణంలో ఉంది. కార్యాలయం అడిక్‌మెట్‌లోను, విశ్వవిద్యాలయ కళాశాల బాగయాంలోని ఒక భవనంలోన ఉండేది. విశ్వవిద్యాలయంలో ఉన్నప్పుడు శ్రీ హరిహరశాస్త్రి శ్రీ ధారేశ్వర్‌ల వద్ద ప్రత్యేకంగా పాణినీయాదులు అధ్యయనం చేశారు. ఉపాధ్యాయ వృత్తిలో చేరి క్రమంగా కన్నడ ఎం. ఎ., సంస్కృతం ఎం.ఎ.లలో ఉత్తీర్ణులైనారు. 1965లో గుల్బర్గాలో ప్రభుత్వ ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయులుగా పదవీ విరమణ చేశారు. గుండాచార్యులు 30 సంవత్సరాల ఉపాధ్యాయ వృత్తిలో వందల కొలది విద్యార్థులకు విడిగా సంస్కృతం నేర్పారు. సంస్కృతంలో 47 గ్రంథాలు వ్రాశారు. మాతృ భాష తెలుగులోను, కన్నడ, సంస్కృత, హిందీ, ఉరుదూ. ఆంగ్లాలలో అసమాన పాండిత్యం సంపాదించారు. కన్నడ సంస్కృతాలలో రంజకంగా ప్రసంగిస్తారు. [illegible] ఆయన పని సంస్కృత పాట ప్రవచనాలు. ఆయన గ్రంథాలలో ప్రసిద్ధమైనవి సురపుర సంస్కృత [illegible]కేతిహాసః, ప్రతిమోపాసనం, అరవిందుని గీతాల అనువాదం, ఖుదద్ అనువాదం, కన్నడ నవలలు అనువాదం ముఖ్యమైనవి. సుధర్మ సంస్కృత దిన పత్రికకు తరచు వ్యాసాలు వ్రాస్తూ ఉంటారు. సంస్కృతంలో 47 ఉద్గ్రంథాలు రచించినా, గర్వలేశమైనా లేనివారు గుండాచార్యులు. భారతీయ సంస్కృతి నశించదని, సంస్కృతానికి ఉజ్జ్వల భవిష్యత్తు ఉందని దృఢంగా విశ్వసిస్తారు. తెలుగు వారు ఎక్కడ మెట్టినా తెలుగు జాతి కీర్తిని గుట్టలుగా పోశారు. తమిళ, కన్నడ, మహారాష్ట్ర, ఉత్తరప్రదేశ్‌లలో తెలుగు వారు తమ జాతి గౌరవ పతాకను ఎగురవేశారు, వేస్తూనే ఉన్నారు. తెలుగు జాతి గౌరవాన్ని నిలబెడుతున్న మహనీయులలో మరొకరు పెరుమాళ్ల గుండాచార్యులు.

### శ్రీ బి. ఎ. రెడ్డికి జాతీయ బహుమతి:

ఆంధ్రప్రదేశ్ చిత్ర కళా రంగానికి సుపరిచితులైన శ్రీ బి.ఎ. రెడ్డికి ఈసంవత్సరం ఉత్తమ ఉపాధ్యాయులకు ఇచ్చే జాతీయ బహుమతి లభించింది. శ్రీరెడ్డి గోల్కొండ కేంద్రీయ విద్యాలయంలో చిత్ర కళోపాధ్యాయులుగ 15 సంవత్సరాలుగా పని చేస్తున్నారు. కృష్ణా జిల్లా పామర్రు వాస్తవ్యులు. ఈయన పర్యవేక్షణలో ఈ విద్యాలయ విద్యార్థులు రాష్ట్ర స్థాయిలోనే కాక జాతీయ అంతర్జాతీయ స్థాయిలో అనేక బాల చిత్రకళా ప్రదర్శనాలలో పాల్గొని వేలకొలది బహుమతులు పొందారు. ఈ విద్యాలయం బాలలు ఎనిమిది మంది సోవియట్ ల్యాండ్ నెహ్రూ అవార్డును గెలుచుకొని, సోవియట్ రష్యాను సందర్శించి, అచ్చటి నల్ల సముద్రంలోని ఆర్టెక్ యంగ్ పయనీర్స్‌లో నెల రోజులపాటు పాల్గొని వచ్చారు. మరి ఎనిమిది మంది బాలలు యోగ్యతా పత్రాలు పొందారు. అంతే కాక గడచిన పన్నెండు సంవత్సరాలుగాఈవిద్యాలయం విద్యార్థులుకొరియా, జపాను, ఫిన్ ల్యాండ్ మున్నగు దేశాలు నిర్వహించిన చిత్రకళా ప్రదర్శనలలోపాల్గొని బహుమతులు సంపాదించారు. శ్రీ రెడ్డి పర్యవేక్షణలో ఈ విద్యాలయం గడచిన తొమ్మిది సంవత్సరాలుగా జాతీయస్థాయిలో బాల కళా ప్రదర్శనాలు హైదరాబాద్ కళా భవన్‌లో నిర్వహిస్తున్నది. శ్రీ రెడ్డి అనేక కళా సంస్థలు నిర్వహించిన ప్రదర్శనలలో పాల్గొని పెక్కు స్వర్ణ పతకాలతో సహా దాదాపు ఎనభై బహుమతులు సంపాదించారు. కేంద్రీయ విద్యాలయ సంఘటన్ ఈయనను ఉత్తమ ఉపాధ్యాయ బిరుదంతో గౌరవించింది. ఈయన ఆంధ్రప్రదేశ్ కౌన్సిల్ ఆఫ్ ఆర్టిస్ట్స్ గౌరవ కార్యదర్శి. రాష్ట్ర లలిత్ కళా ఎకాడమీ సభ్యులు. తమ కళా సేవతో రాష్ట్రానికి గౌరవ ప్రతిష్ఠలు కలిగిస్తున్న శ్రీ రెడ్డికి ఉత్తమ ఉపాధ్యాయ జాతీయ పురస్కారం లభించడం ప్రశంసనీయం.



### బల్లకట్టు బాపులు, ఆవిష్కరణ :

సజీవమైన పాత్ర చిత్రణతో సహజమైన వాతావరణంతో, సరళంగా, సాఫీగా కథ చెప్పగల నైపుణ్యం శ్రీమతి ఎ. లక్ష్మీ రమణగారికి ఉందని డాక్టర్ సి. నారాయణరెడ్డి సెప్టెంబర్ 9న బల్లకట్టు బాపులు కథానికా సంపుటి ఆవిష్కరణోత్సవానికి ఆంధ్ర సారస్వత పరిషత్తు హాలులో అధ్యక్షత వహించిన సందర్భంలన్నారు. రాష్ట్ర హైకోర్టు న్యాయమూర్తి శ్రీ గంగాధరరావు కథానికా సంపుటిని ఆవిష్కరించారు. గ్రంథ స్వీకర్త శ్రీ దేవులపల్లి రామానుజరావు ప్రసంగిస్తూ, శ్రీమతి లక్ష్మీరమణ కథనంలో ఆర్ద్రత,కరుణ, జాలువారుతుంటాయని, అన్నారు. డాక్టర్ దావి భారతి కథానికా సంపుటిలోని పదకొండు కథలను పరిచయం చేశారు. శ్రీ కె. కె. రంగనాథాచార్యులు కృతజ్ఞతా వందనాలతో సభ సమాప్తమైంది.

### ఉపశ్రుతి :

సంవత్సరానికి ఎన్ని వారాలు ? అని ప్రశ్నించాడొక పిచ్చివాడు నన్ను. 52 అన్నాను. ఐదేళ్లకు ఎన్ని వారాలు ? అన్నాడు. 52ను ఐదుతో హెచ్చవేసి 260 అన్నాను. ఇకనేం సమస్య తీరిపోయింది. అధికార పక్షంలోని విధాన సభ్యులందరినీ వరుసగా వర్ష క్రమానుసారంవారానికొకరిని చొప్పునముఖ్యమంత్రిని చేస్తే పోలా. పరిపాలన చేసే వారు ప్రభుత్వ కార్యదర్శులే కదా! అంటూ వెళ్లిపోయాడు.

—తిరుమల రామచంద్ర

# ఉచితం!

స్వస్తిక్
నీమ్ సబ్బు

స్వస్తిక్
డిటర్జెంట్ పౌడర్ యొక్క
1 కిలో ప్యాక్ కొనడంతో
పాటు




## త్వరపడండి!
## స్టాకు పరిమితం!

అన్నిటికన్నా విభిన్నమైనది
నీలి స్వస్తిక్ డిటర్జెంట్ ఉతికే పౌడర్
ధర తక్కువలో తక్కువ...ఉతుకుతుంది ఎంతో చక్కగ

Shilpi DM 30A/80 Tel

# వంటలు

## కుష్డా బజ్జీ

కుష్డా అంటే గుమ్మడికాయ. బెంగాలీలు కుమేడా అంటారు. దీనితో బజ్జీలు చేసుకుంటే చాలా బాగుంటాయి.

కావలసినవి :— ఒక కప్పు శెనగపిండి, తగినంత ఉప్పు, కారం, నూరిన జీలకర్ర లేక నల్లజీలకర్ర, ఒక చెంచా బియ్యం పిండి (బజ్జీలు కరకరలాడుతూ ఉండడానికి) చిన్న గుమ్మడికాయ ముక్క.

తయారుచేయు విధానము :— శెనగపిండి, ఉప్పు, జీలకర్ర, చిన్న చెంచా బియ్యం పిండి వేసి నీళ్ళు పోసి గరిటె జారుగా కలుపుకోవాలి. గుమ్మడికాయ ముక్కపై చెక్కు తీసి సన్నగా పల్చగా 2 అంగుళాలు వెడల్పు పొడవుగా ఏకంగా ఒక గుమ్మడికాయ ముక్క తీసుకొని బంగాళదుంప తరుక్కున్నట్లే గుమ్మడికాయను తరుక్కొని మూకుడులో నూనెపోసి మరిగేక ఒక్కొక్క ముక్క బజ్జీ పిండిలో ముంచి నూనెలోవేసి రెండుప్రక్కల ఎర్రగా వేగేక తీసేసి వేడిమీద తింటే బావుంటాయి. కూరలాగ అన్నంలో నూనెవేసి నంచుకు తిన్నా బావుంటాయి ఈ బజ్జీలు.

— ఎన్. లక్ష్మి

## పూరీ బొబ్బట్లు

కావలసిన వస్తువులు :— గోధుమపిండి—$\frac{1}{2}$కిలో, నూనె లేక డాల్డా—$\frac{1}{4}$కిలో, నెయ్యి—1గరిటె, కొబ్బరికాయ—1, గసగసాలు—50 గ్రాములు, పాలు—1 కప్పు, ఏలకుపొడి.

చేయు విధము :— జల్లించిన గోధుమ పిండిలో నేయి, రవ్వంత ఉప్పు వేసి, నీరు పోసి గట్టిగా కలపవలెను.

కొబ్బరి కోరుకొని గసగసాలు, పంచదార, ఏలకుపొడి వేసి మెత్తగా కాటుకవలె రుబ్బుకొని పాలు కలిపి సన్నని సెగమీద పెట్టి కాచవలెను. గోధుమ పిండిని పూరీలు వత్తుకొని పూరీని మడిచి కాల్చవలెను. కాలగానే పాలలో వేయవలెను. పాలు బాగా ఉడికి చిక్కబడిన తర్వాతనే పూరీలను వేయవలెను. పాలలో నానిన పూరీలను తీసి వేరే పెట్టి మళ్ళీ వేడివి వేయవలెను. 1రోజు నిలువ వుండును.

— కారుటూరి పద్మావతి

# మువ్వల మురళి

(18 వ పేజీ తరువాయి)

నువ్వు అసలైన ఉత్తమ ఇల్లాలి వనిపించుకుంటావు. భార్యాభర్తల బంధాలకి విలువ ఏమిటి? భార్య అంటే అర్థం ఏమిటి అసలు? భర్త తప్పు ఒప్పులను గుండెల్లో గుప్తంగా దాచుకుని, బాధలను గాథలను దిగమింగుకుని, ఓర్పుగా నేర్పుగా సమస్యలను చక్కదిద్దుకుని, కొడిగడుతున్న ఆనంద జ్యోతులకి ధైర్య సాహసాలు అనే చమురును పోసి, ఆ ఆనందజ్యోతులను దేదీప్యమానంగా వెలిగేలా చేసి, చీకటి నిండిన మనసునీ, ఇంటినీ కాంతివంతం చెయ్యగలిగేదే నిజమైన గృహలక్ష్మి. విజ్ఞానవంతురాలు. అప్పుడే ఆమె భర్తకి ప్రియమైన ప్రాణాధికమైన భార్య కాగలుగుతుంది'' అంది విశాలి శాంతంగా నొక్కి పలుకుతూ.

''వదినా !'' ఇక భరించలేనట్టు అసహనంగా అంది.

''హరితా ! నీ మాటలు నేను నమ్మతాను. ఇది పూర్తిగా నీ తప్పు అని నేను అనలేను'' అంటూ చిరునవ్వు నవ్వి మళ్ళీ అంది—

''ఈ సంఘంలో పురుషుడికి స్థానబలం ఎక్కువ, స్త్రీ స్థానబలం అతి స్వల్పం. ఆమె చేసిన ప్రతీ చిన్న పనిని భూతద్దాల్లోంచి చూస్తూ పరిశీలిస్తుంది ఈ సంఘం. ఏమాత్రం అవకాశం చిక్కినా వాళ్ళని అధఃపాతాళానికి అణగత్రొక్కేస్తుంది. అందుకే స్త్రీ ఎప్పుడూ మనో నేత్రాలను తెరిచి తను నిలుచున్నచోటు తనకి క్షేమదాయకమైనదా? కాదా? అని ప్రతి క్షణం ఆలోచించి, జాగ్రత్తపడాలి. పురుషుడికి ఆ భయంలేదు. అతను సహజంగా బలవంతుడు,స్వతంత్రుడు. ఎవ్వరికి జడవ వలసిన పనిలేదు. అందుకే ఈ ప్రపంచంలో స్త్రీకి ఒక న్యాయం, పురుషుడికి ఒక న్యాయం.'' అంటూ కొద్దిసేపు ఆగి మళ్లీ చెప్పింది—

''స్త్రీ పెళ్లి కానప్పుడు స్వేచ్ఛాజీవి. పెళ్లి అయిన తరువాత ఆ ఇల్లాలు పైనే ఆధారపడి వుంటాయి, ఆ ఇంటి పరువూ, ప్రతిష్టలూ, భర్త గౌరవ మర్యాదలూ. గడపదాటి ఎప్పుడైతే బయటకు అడుగు పెట్టిందో ఆమె ఆ యింట్లో స్థానాన్ని కోల్పోయినట్టే ! ఆసంగతి ముందే గ్రహించుకుని ఆ స్థానాన్ని మాత్రం వదలకూడదు. అక్కడేవుండి ఇంటికి పట్టిన గ్రహాల్ని వదిలించేసే ప్రయత్నాలని చెయ్యాలి. న్యాయమైనా, ఆ ఇంటి స్థానమైనా ఇల్లాలికే దక్కుతాయి. ఆమెకున్న హక్కులని మాత్రం ఎవ్వరూ, ఎప్పుడూ త్రోసిపుచ్చలేరు.''

''అయితే నేను తొందరపడి ఆ ఇంటి నుండి వచ్చేశానంటావా ?'' అడిగింది హరిత, దుఃఖాన్ని ఆపుకుంటూ.

''అది కాదమ్మా ! భర్తను ఎప్పుడూ శాంతంగా, మంచి మాటలతో మెల్లగా అడిగి అసలు విషయం తెలుసుకోవాలి. అంతేగాని, నీ విలువెంత? నా విలువెంత! నీ బలం ఎంత! నా బలం ఎంత! నువ్వు గొప్పా! నేను గొప్పా! గెలుపు నీదా! నాదా! అంటూ పోట్లాడితే, పురుషుడికి చికాకుకలిగి పిచ్చెత్తిపోయి, అసహ్యం వేసేస్తుంది. అంతవరకూ కాస్తో కూస్తో భార్య అంటే అతనికి వున్న భయం తుడుచుకుపోయి, మొండి ధైర్యం వచ్చేస్తుంది. ఛట్! నన్ను శాసించే అధికారం నీకు ఏముంది! నా యిష్టం వచ్చినట్టు నేను తిరుగుతాను, అడగడానికి నువ్వెవరు? అంటూ భార్యపై కోపంతో తిరగపడతాడు. అప్పుడు ఎవ్వరూ ఏం చెయ్యలేరు.''

''వదినా!''

''నువ్వు ఇల్లు విడిచి రావటం, చాలా పొరపాటు పని చేశావు.''

హరిత మాట్లాడలేదు. వదిన మాటల్లో నిజం వుందేమో! అని ఆలోచిస్తూ దుఃఖించసాగింది. ఆమె ఆలోచనా ప్రవంతి అలా సాగుతూనే వుంది. ఆమె కన్నీరు మున్నీరు అయి అలా పారుతూనే వుంది. మనసులో బాధ అలలై ఎగసి పడుతూనే వుంది. ఎన్ని రాత్రులు, ఎన్ని పగలు అయినా దుఃఖానికి అంతే లేదు.

రోజులు గడుస్తున్నాయి. రోజుల్లో మార్పులేదు. కృష్ణమూర్తి జాడ ఎక్కడా లేదు. అతను దాదాపు భార్యని మరచిపోయినట్టే అని నిశ్చయం అవుతూంది.

హరితకు ఒంట్లో బాగుండటం లేదు.

నీరసంగా, మాట మాటకి కళ్ళు తిరుగుతూ, ఏమైనా తింటే వాంతి అయిపోతూంది.

## 42

మర్నాడు మెయిలుకి మల్లిఖార్జునరావు మద్రాసు వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు.

కాని ఆరోజు ఎవ్వరూ వూహించని విధంగా జరిగిపోయింది. మల్లిఖార్జునరావు మర్నాడు మద్రాస్ వెళ్తాడనగా, ఆరోజు సాయంత్రం ఫ్రెండ్ యింటికి బయిలుదేరి వెళ్ళాడు. అక్కడ చాలాసేపు కూర్చుని వచ్చేసేటప్పటికి రాత్రి తొమ్మిది దాటి పోయింది. ఏదో అర్జంటు పని గుర్తువచ్చి మరో ఫ్రెండ్‌ని కలుసుకోవడానికి వెళ్ళాడు. ఆ ఫ్రెండ్ పేరు సుబ్బారావు. పెళ్ళి చేసుకున్నా ఆమెను ఒదిలిపెట్టేసి వైజాగ్‌లో రూమ్ తీసుకుని వుంటున్నాడు. సుబ్బారావు లక్షాధికారి ఏకైక పుత్రుడు. అతనికి అన్ని దురలవాట్లూ వున్నాయి.

కారు ఆపి లోపలకు వెళ్ళి తలుపు కొట్టాడు. తలుపు త్వరగా తెరుచుకోలేదు. మల్లిఖార్జునరావు తలుపునుగట్టిగా బాదాడు. లోపల లైటు వెలుగుతూంది. తను తలుపు కొట్టగానే లైటు ఆరిపోయింది. అతను ఆశ్చర్యపోయాడు.

మళ్ళీ కొట్టాడు. ఈసారి ఆ తలుపులు వెంటనే తెరుచుకున్నాయి, అసలు అంత వరకూ గడియే వెయ్యలేనట్టు. ఆశ్చర్యంగా లోపలకు అడుగు పెట్టాడు. గది అంతా చీకటి. కన్ను పొడుచుకున్నా కనపడని గాఢాంధకారం. కళ్ళకి ఏం కనిపించటంలేదు. గది అంతా నిశ్శబ్దంగా వుంది. ఎవ్వరూవున్న అలికిడి లేదు.

మల్లిఖార్జునరావుకి అంతా ఆశ్చర్యంగా వుంది. అంతవరకూ ఆ గదిలో లైటు వెలుగుతూంది. తలుపులు మూసివున్నాయి. తలుపు తను కొట్టగానే లైటు ఆరిపోయింది. కాస్సేపటికి తలుపు తెరుచుకుంది. అతనికి విచిత్రంగా వుంది.

స్విచ్‌కోసం గోడంతా తడిమాడు. ఆ స్విచ్ ఎక్కడవుందో తెలీదు. మెల్లగా ఎలాగో తెలుసుకుని లైటు వేశాడు. గది అంతా ఒక్కసారి వెలుతురుతో నిండిపోయింది.

మల్లిఖార్జునరావు తలతిప్పి సుబ్బారావు కోసం చూశాడు. సుబ్బారావు తల గోడకు చేరేసి, కళ్ళు పైకి పెట్టి ఎటో చూస్తూ గోడకి నిలువునా చేరబడి వున్నాడు. మతిలేని వాడిలా, ఏదో దీర్ఘమైన ఆలోచనలో మునిగి పోయినట్టు కనురెప్ప వెయ్యకుండా నిలువు గుడ్లేసుకుని, స్నేహితుడు రావటం కూడా గమనించనట్టు ఏటో చూస్తున్న సుబ్బా రావుని ఆశ్చర్యంగా చూస్తూ ఒక్క అంగలో దగ్గరకు వెళ్ళి—

"ఒరేయ్, ఏమిట్రా! అలా చూస్తున్నావు!" అంటూ అతడి భుజాలు పట్టి వూపాడు.

అంతే! అతనికి ఏమాత్రం ఒంట్లో సత్తువ లేనట్టు, మల్లిఖార్జునరావు కదప గానే సుబ్బారావు నిటారుగా మల్లిఖార్జున రావు పైకి ఒరిగిపోయాడు.

అంతే! మల్లిఖార్జునరావు కంగారు పడి పోయాడు. గొంతు పెగిలి మాట రాలేదు. సుబ్బారావు వీపు నుండి రక్తం ధారలు కడ్తూంది. బీరు బాటిల్ పగలగొట్టేసి, కత్తి ఆకారంతో మొనదేలిన బోటిల్ తాలూకు గాజు పెంకుతో అతని వెన్నులో నిర్దాక్షిణ్యంగా పొడిచి చంపారు ఎవరో !

కొద్దినిముషాలు క్రితమే సుబ్బారావు ప్రాణవాయువులు అనంత విశ్వంలోకి ఎగిరి పోయి, నిర్జీవంగా పడివున్నాడు. మల్లిఖార్జున రావుకి ఆ క్షణంలో ఒళ్ళు ఝల్లుమంది. శరీరం కంపించి పోయింది. గుండెలు దడ దడ కొట్టుకున్నాయి. తనపై నిటారుగా వాలిపోయిన సుబ్బారావు శవాన్ని అతికష్టం మీద తిరిగి గోడకు చేరేయాలని చూశాడు. ఎంత చేరేసినా ఆ శవం ముందుకి ఒరిగి పోతూంది. ఇక లాభంలేదని కంగారుగా, భయంగా, తొట్రుపాటు పడుతూ ఆ శవాన్ని క్రింద పడుకోబెట్టేశాడు. భయంతో, ఖంగారుతో మల్లిఖార్జునరావుకి ముచ్చెమటలు పోసేస్తున్నాయి. గుండెలు దడదడా కొట్టుకుని, ఆయాసంతో మాట రావటంలేదు.

అప్రయత్నంగా షర్టు వైపు చూసుకున్నాడు. రక్తం మరకలతో అసహ్యంగా తయారయింది. చేతులు రెండూ రక్తసిక్తం అయి, అతన్ని ఓ ఖూనీకోరుగా రుజువు చేస్తున్నాయి. సుబ్బారావు వెన్నులో నుండి వచ్చిన రక్తం కాలువలు కట్టినట్టు, గది అంతా రక్తపు మడుగు అయింది.

మల్లిఖార్జునరావుకి గుండెల్లో దడ ఎక్కువైంది. తను ఈ ఖూనీ చెయ్యక పోయినా, అంతా తనని ఖూనీకోరు అనే అంటారు.

అతనికి తల తిరిగిపోతూంది. శరీరంలో శక్తి కూడదీసుకుని మెల్లగా లేవడానికి ప్రయత్నించాడు.

"ఎవ్వరూ చూడకుండా పారిపోవాలి! అవును పారిపోవాలి !!"

అతనిలో పిచ్చి చూపులు మొదలు అయ్యాయి. చెయ్యని నేరం ఎక్కడ మీద పడుతుందో అన్నట్టు భయం భయంగా, అచ్చు ఖూనీకోరులాగే దొంగ చూపులు, వెర్రిచూపులు చూస్తూ పారిపోయే లోపు, ఆ గది ముందు ఎవరో వస్తున్న అలికిడి అయింది.



త్వరలో



స్పందన



సీరియల్



# మువ్వల మురళి

"అమ్మో! ఎవరో వచ్చేస్తున్నారు. పోలీసులు కాబోలు" అతని కనుగుడ్లు అలా నిలబడిపోయాయి. చెవులు రిక్కించి శబ్దం ఎటు వస్తూందో వినసాగాడు శ్రద్ధగా, జాగ్రత్తగా!

ఎవరివో బూట్ల చప్పుడు అవుతున్నాయి. చప్పున లైటు ఆర్పేసి, తలుపు మూలగా నక్కేసాడు.

గదిలోకి ఎవరో వచ్చినట్లు అయింది. అంతే! మల్లిఖార్జునరావు ఒక్క ఉరుకులో బయటకు పరుగెత్తాడు. మనిషి అలికిడి అవటంతో వచ్చిన వాళ్లకి అనుమానం వచ్చి లైటు వేశారు. సుబ్బారావు రక్తపు మడుగులో పడి వున్నాడు. వచ్చిన వాళ్లు ఒక్కకేక పెట్టారు.

మల్లిఖార్జునరావు వీధిలోకి కారువైపు పరుగెట్టి పారిపోవటం చూశారు.

"ఖూనీ. ఖూనీ జరిగిపోయింది. పట్టుకోండి, పారిపోతున్నాడు" అంటూ అరవసాగారు అంతా.

చుట్టు పక్కల వున్న వాళ్ళు అంతా వచ్చేశారు. కారులో వున్న మల్లిఖార్జునరావుని, కారు నెంబర్ని చూశారు అంతా! ఆ చూసిన వాళ్లల్లో ఒకతను, "మల్లిఖార్జునరావు అనీ, ఫలానా చోట యిల్లు అనీ, బ్యాంక్‌లో పని చేస్తున్నట్టూ" చెప్పాడు.

* * *

మల్లిఖార్జునరావు యింటి తలుపు దబదబ మంటూ బాదేశాడు, అతను కాలింగ్ బెల్ నొక్కాలన్న సంగతి మరచి.

తలుపు తియ్యగానే అతన్ని చూసి విశాలి కేవ్వున అరిచింది. తల రేగిపోయి, ఒళ్ళు, బట్టలూ రక్తంతో తడిసి వున్నాయి. అతను లోపలికి దూరిపోయి, కంగారుగా తలుపులు మూసేశాడు.

"ఏమండీ, ఏమిటి! ఏం జరిగింది!" అంటూ భయంగా, కంగారుగా ఒణికిపోతూ ప్రశ్నించింది.

"ఉష్" అంటూ చూపుడువేలు పెదవులపై నిలువుగా పెట్టి, భార్యను మాట్లాడ వద్దు అన్నట్టు చూశాడు.

మల్లిఖార్జునరావుకి మాట రావటంలేదు. ఏమిటి? అని హరితా, గోవిందమ్మా అక్కడికి వచ్చారు.

అంతే! వాళ్ళా అలా వుండిపోయారు. అతన్ని చూస్తూనే వాళ్ళకి మతి పోయింది. ఏం జరిగింది! ఏమైంది? అని అలా నిలబడి పోయారు.

## 43

విశాలి తెలివితప్పి పడిపోయింది. పోలీసులు వచ్చి మల్లిఖార్జునరావుని అరెస్టుచేసి తీసుకు పోయారు. ఇల్లు అంతా బావురుమంటూ ఏదోగో అయిపోయింది. హరిత తెలివివుండీ లేనట్టు అలా వుండిపోయింది.

గోవిందమ్మ, "బాబూ! మల్లిక్" అంటూ గుండెలుబాదుకుంటూ ఏడ్వసాగింది.

యిరుగూ పొరుగూ అంతా వింతగా, విడ్డూరంగా పోలీసుల వెంటే వచ్చేశారు. అతన్ని అరెస్ట్‌చేసి తీసుకు వెళ్తుంటే అంతా రకరకాలుగా కథలు అల్లి చెప్పుకో సాగారు, ఆ ఖూనీ గురించి.

"అయ్యో పాపం!" అన్నవాళ్ళు కొందరు.

"ఏమో! ఏం కసివుండి ఖూనీ చేశాడో!" అని కొందరు.

ఇలా రక రకాలుగా వచ్చినవాళ్ళు అంతా వ్యాఖ్యానించసాగారు.

విశాలికి పావుగంట వరకూ తెలివి రాలేదు. తెలివి రాగానే హరితను, అత్తగార్ని పట్టుకుని ఏడ్చేసింది. హరిత నిర్జీవ శిలలా వుండి పోయింది.

తన చేతిలో ఏముంది ! ఏంచెయ్యగలదు! ఎలా వూరుకోబెట్టగలదు ! వదిన్ని వూరుకో బెట్టే ధైర్యం తనకి ఏది ! మరొకటి మరొకటీ కాదు ఖూనీకేసు. అన్నయ్య చేశాడా ! లేదా ! నిజానిజాలు తెలియవు.

వచ్చినవాళ్ళు అంతా అంటున్నారు—

"మీ ఆడపడుచు భర్త పెద్ద పేరున్న లాయరు కదమ్మా! ఆయనికి కబురు పెట్టండి త్వరగా" అని ఒకరు విశాలితో అంటే,

"ఏమ్మా! మీ అల్లుడు లాయరే కదా! అతను వస్తే మీకు ధైర్యంగా వుంటుంది" అని గోవిందమ్మతో మరొకరు అంటుంటే, హరితతో ఒకళ్ళు అంటున్నారు—

"మీ ఆయనకి కబురు చెయ్యమ్మా! నువ్వు కూడా అలా అయిపోతే ఎలా. నువ్వు పెద్ద పేరున్న లాయర్ భార్యవు. మీ అన్నయ్యని చిటికెలో విడిపించి మీ వదిన కన్నీళ్ళు తుడవగలవు" అన్నారు.

వాళ్ల మాటలతో హరిత గుండె ఒక్కసారి ఝల్లుమంది. మాటా పలుకూ లేనట్టు వారి వైపు అలాగే చూస్తూ వుండిపోయింది. ఆమె తల తిరిగి పోతూంది.

అటు అన్నగారు అరెస్ట్ అయ్యాడు. అన్నయ్యను విడిపించాలి అంటే అందుకు ఒకటే మార్గం ! తను వెళ్ళి, అభిమానం చంపుకుని భర్త కాళ్లమీద పడాలి. ఆయన తప్ప అన్నయ్యను ఎవ్వరూ రక్షించలేరని తెలుసు.

ఇప్పుడు ఏం చెయ్యాలి? ఆయనకు తన ముఖం జన్మలో చూపించను. ఆ యింటి గుమ్మం తొక్కను అని వుత్తరం వ్రాసిపెట్టి వచ్చిందే! మళ్ళీ ఆ యింటికి ఎలా వెళ్ళటం! ఆ రోజా ! దాని ముఖం చూడాలంటే

---

## కవి కలం

ఆకర్షిస్తున్నది
అభిమానులను కవితా జగత్తు
అందిస్తున్నది
కవితలను కవికల్పనా మహత్తు
ఆనందింపజేస్తున్నది
పాఠకులను పదాల గమ్మత్తు
అందుకుంటున్నది
ప్రజల నీరాజనాలను యావత్తు.

— చింతా వి. రెడ్డి

---

ప్రాణం పోతున్నట్టు వుంటుంది. ఇప్పుడు ఏం చెయ్యాలి? ఆమెకు ఆలోచనలతో తల పగిలిపోతూంది. యిరుగూ పొరుగూ అంతా ఎవరికి తోచిన సలహా వాళ్ళు ఇచ్చి వెళ్ళి పోయారు.

కళకళలాడే యిల్లు మరుభూమిలా మారి పోయింది. దెబ్బమీద దెబ్బ తగులుతూనే వున్నాయి. హరిత సంసారం ఏదోవిధంగా చక్కదిద్దుదాము అనుకుంటుండగా ఇలా జరిగింది.

ఎక్కడ కూర్చున్నవాళ్ళు అక్కడే, అలాగే నిర్లిప్తతో నిర్వేదంతో వుండిపోయారు. రాత్రి అంతా అలా జాగరం చేశారు.

మర్నాడు హరితా వాళ్లకు తెలిసింది, కృష్ణమూర్తి క్రితంరోజు సాయంత్రమే వూరు వెళ్లాడనీ, ఎప్పుడు వస్తాడో తెలియదని.

విశాలి ఈ వార్త వినగానే ఇంకా దుఃఖం పొంగిపొర్లింది. హరితను పట్టుకుని భోరున ఏడ్చింది.

"హరితా ! నీ కాళ్లు పట్టుకుంటాను. నువ్వువెళ్ళి అన్నయ్యగారితో మాట్లాడి మీ అన్నయ్యను విడిపించు అమ్మా" అంది ప్రాధేయపడూ.

"వదినా !" అంది త్రుళ్ళిపడినట్టు, ఆ పని మాత్రం నేను చెయ్యలేనట్టు చూస్తూ.

"హరితా ! నీ తోడబుట్టిన అన్నయ్య కోసం ఈమాత్రం చెయ్యలేవా ? ఈ వదిన ముఖం చూసి కాకపోయినా, నీ మేనల్లుడు వాడి ముఖంచూసి నీవీసాయంచేసిపెట్టమ్మా" అంది కొడుకుని ఒళ్లోకి తీసుకుని, బావురు మంటూ ఏడుస్తూ.

బాబు కూడా తెల్లవారి నుంచీ తల్లీ, నానమ్మా ఏడ్వటం చూసి వాడు హడిలిపోయి ఒకటే ఏడుపు మొదలుపెట్టాడు.

తల్లీ, వదినా, మేనల్లుడి ఏడ్పు వింటుంటే ఆమె హృదయం నలిగిపోయి, కమిలిపోయి, తూట్లు తూట్లుపడిపోసాగింది.

"వదినా !" గుండెల్లో బాధ సుడులు తిరుగుతూ, ప్రాణం మెలితిరిగి పోతూంది.

తల్లి ఏడుస్తూ, "హరితా! వాడు నీ అన్నయ్యమ్మా! నీ తోటబుట్టిన వాడు. ఒక రక్తాన్ని పంచుకు పుట్టిన వాళ్ళు మీరు. నీ కాళ్ళు కడిగి కన్యాదానం చేసినవాడు. వాడి మీద నీకు కనికరం లేదా! మీ ఆయనకి ఈ వూళ్ళో ఎంతో పేరుంది హరితా! ఒక్కసారి మీ ఆయన దగ్గరకు వెళ్ళమ్మా! నాడ్ని విడిపించే ఏర్పాటు చెయ్యమ్మా !" అంది ఆవిడ.

"అమ్మా !" బాధతో కళ్ళు గట్టిగా మూసుకుంటూ, 'ఆపని మాత్రం నావల్ల కాదు' అన్నట్టు తల అడ్డంగా తిప్పింది. కన్నీళ్ళు టపటపా రాలిపడ్డాయి.

"హరితా ! నా బాధ నీకు అర్థం కాదమ్మా" అంటూ విశాలి హరిత చేతులు పట్టుకుంది.

"మీ అన్నయ్య ఆ హత్యచేసి వుండరు. ఎవ్వరికీ ఎలాటి అపకారం తలపెట్టని ఆయన హత్య చేస్తారా! హరితా ! నీ మనసు ఎలా ఒప్పుతూంది! మీ అన్నయ్యని విడిపించాలని నీకు అనిపించటం లేదా! నీ చేతిలో వుంది నీ మాటమీద వుంది అంతా! నువ్వు వెళ్ళి అడిగితే అన్నయ్యగారు ఈ సాయం తప్పక చేస్తారు."

## అవీ...ఇవీ...అన్నీ

### ఈ రేకులు విచ్చుకుంటాయా ?

అధరాపురపు తేజోవతి వ్రాసిన నవల ఈ రేకులు విచ్చుకుంటాయా ? మా కార్యాలయం చేరింది. 256 పుటలు గల యీ నవల ప్రతుల కోసం మాధురి పబ్లికేషన్స్, గాంధినగర్, హైదరాబాద్ — 500 380 కి వ్రాయాలి. వెల 12 రూపాయిలు.

### పదాంజలి

'రసిక' అను గుర్రం భానుమూర్తి రాసిన 'కూనలమ్మ పదాల' పదాంజలి. (వెల రూ. 3)37 పుటల పుస్తకం మా కార్యాలయం చేరింది. ప్రతులకు రచయితపేర ఎస్. వి. యు. కాలేజీ ఆఫ్ ఇంజనీరింగ్, తిరుపతికి వ్రాయాలి.

### భువన నాదం

శ్రీ బండి లక్ష్మీనరసింహారెడ్డి కవితల సంపుటం భువననాదం.218పుటలు మా కార్యాలయంచేరింది. వెల తెలియదు. ప్రతులకి శ్రీ లక్ష్మీ ప్రచురణలు, గాంధినగరం, విజయవాడ—3కి వ్రాయవచ్చును.

### నారసింహ సూక్తులు

రచన : ఉపాధ్యాయుల లక్ష్మీనరసింహము, పుటలు : 22. వెల : తెలియదు. ప్రతులు కావలసిన వారు రచయితపేర ఇన్‌కంటాక్సు ఆఫీసర్, సిబిటీస్ ఆఫీసు, విశాఖపట్నం, 530003కి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

### శ్రీ వేంకటేశ్వర స్తోత్రములు

గేయరచన : శ్రీ లలితా త్రిపుర సుందరీదేవి ఉపాసకులు. 21 పేజీలు గల ఈ పుస్తకము వెల తెలియదు. ప్రతులకు —పొనసోనపల్లి నరశింగరావు, ధన్వంతరి క్లినిక్, శృంగవరపుకోట, విజయనగరం జిల్లా (ఆం.ప్ర) కి వ్రాయాలి.

### కసిగా కదిలివస్తే

యువ రచయితల వేదిక ప్రజాసాహితి ప్రచురించిన కవితా సంపుటం. రచన : శ్రీ రవీంద్ర. 54 పేజీలు, వెల : మూడురూపాయలు. ప్రతులకు : ప్రజాసాహితి, కేరాఫ్ "కేకలు", తెలుగు వారపత్రిక, వీక్లీ బజార్,నిజామాబాద్ 503001.

### ప్రమతి శతకము

గ్రంథకర్త : బ్రహ్మశ్రీ శానంపూడి మల్లెం కొండయ్యాచార్యులు, పుటలు : 34. 117పద్యాలు గల ఈ సంపుటి వెల రెండు రూపాయిలు. ప్రతులకు శానంపూడి బ్రహ్మానందాచార్యులు, శ్రీ బ్రహ్మనంద ఆయుర్వేదనిలయము, మురుగుళ్లపోస్టు, ఆత్మకూరు తాలూకా నెల్లూరు జిల్లా (ఆంధ్రప్రదేశ్)కి వ్రాయాలి.

### శ్రీ నరసింహ కర్ణామృతము

ఈ గ్రంథమును రచించినవారు మైలవరపు సుబ్రహ్మణ్యము. 90 పేజీలు గల ఈ పుస్తకము వెల 5 రూపాయిలు. ప్రతులు కావలసినవారు మైలవరపు సుబ్రహ్మణ్యము, రిటైర్డ్ జూనియర్ లెక్చరర్,కోరుకొండ, తూర్పుగోదావరి జిల్లాకు వ్రాయవచ్చును.

### ఉషస్సు

రచన : డి. వి. డి. ఎస్. ప్రసాద్, పేజీలు 27, వెల రెండురూపాయిలు. ఈ పుస్తకము కావలసినవారు—డి.వి.డి.ఎస్. ప్రసాద్7—2,హెచ్.నెం. 6—7—56, అరండల్‌పేట, గుంటూరు 522002 కి వ్రాయాలి.

### జాషువా జీవిత కవితా ప్రస్థానం !

డా. బి. భాస్కర చౌదరి రచించిన యీ గ్రంథంలో జాషువా జీవిత ప్రస్థానం,జాషువాకవితా ప్రస్థానాలనే రెండు విడివిడి భాగాలు సమగ్రంగా యీ ఆధునిక కవి గురించి అనేక సంగతులు వెల్లడి చేశాయి. ప్రతులకు విశ్వప్రభ పబ్లిషింగ్ హవుస్, వేండ్రగుంట, చిత్తూరుజిల్లాకి రాయాలి. వెల ఆరు రూపాయలు.

---

## మువ్వల మురళి

"వదినా! నన్ను క్షమించు. నేను ఈ ఒక్క పని తప్ప ఏమైనా చేస్తాను. ఎవరి దగ్గరకువెళ్లి మాట్లాడిరమ్మన్నా మాట్లాడి వస్తాను. లేదా, ఆ ఖూనీ నానెత్తిన వేసుకుని ఆ శిక్ష నేను అనుభవిస్తాను. అన్నయ్య కోసం నా ప్రాణాలు అయినా అర్పిస్తాను. అంతేగాని నేను ఆ యింట్లో కాలు పెట్టలేను. నేను ఆయన ముఖం చూడలేను. త్రెంచుకుని వచ్చేసిన బంధాన్ని వెళ్లి ఏ విధంగా ముడివెయ్యను ! నాపైన ప్రేమా, అభిమానం లేని మనిషి నా అన్నయ్యను ఎలా రక్షిస్తారు అనుకున్నావ్ ? నా నీడనే భరించలేని మనిషి నా కన్నీళ్లు ఎలా తుడుస్తారు అనుకున్నావ్ . అంతా భ్రమ. వెళ్లనంతవరకే ఆ నమ్మకాలు మనకి. మనం వెళ్ళివుంటే ఆయన తప్పక సాయంచేసి వుండేవారేమో అనుకుంటాం. తీరావెళ్లి అడిగాక ఆయన కాదంటే, అప్పుడు బాధపడి చింతిస్తాం ఎందుకు వెళ్లామా ! అని" అంటూ ఆగింది.

విశాలి మాట్లాడలేదు.

"మనిషిని మనిషిగా చూసి గౌరవించాలి. భార్యని బానిసగా చూసి, ఆమెను ఆట బొమ్మను చేసి ఆడించే మగవాడు అంటే నాకు గౌరవంలేదు."

"హరితా !"

"నిజం వదినా! నేను ఈ పెళ్లి చేసుకుని ఏం సుఖపడలేదు. నేను ఆయన్ని ఎంతగా ప్రేమించి పెళ్లి చేసుకున్నానో నన్ను ఆయన అంతగా మోసగించి వంచించారు. నా మనసు విరిగి తునాతునకలు అయిపోయింది. ఇప్పుడు నేను ఆయన ఎదుటకి ఏ ముఖం పెట్టుకు వెళ్లను ! నా కంఠంలో ప్రాణం వుండగా వెళ్లను. ఆయన్ను బ్రతిమాలి, ప్రాధేయపడి అడగలేను. నేను ఇప్పటికే సగం చచ్చి బ్రతుకుతున్నాను. ఇంకా చావలేను. వదినా ! ఇంకా చావలేను" అంటూ చేతుల్లో ముఖం దాచుకుని వెక్కి వెక్కి ఏడ్చింది.

విశాలి ఏం మాట్లాడలేదు. కొడుకుని పక్కన వేసుకుని పడుకుంది.

ఆ రాత్రి పదకొండు గంటలు అయింది— హరితకు అప్పుడే నిద్ర పడుతూంది. తల్లి కేకలు పెద్దగా వినిపిస్తుంటే, చివ్వున లేచి కూర్చుంది. గుండెలు దడదడ కొట్టుకో సాగాయి. లేచి గబ గబ పెరట్లోకి వెళ్లింది. నూతి పళ్లెం దగ్గర గోవిందమ్మ క్రింద చతికిలబడి వుంది. విశాలి అత్తగారి గుండెల్లో తల దాచుకుని వెక్కి వెక్కి ఏడుస్తూంది.

"ఏమిటి అమ్మా, ఏం జరిగింది !" ఆయోమయంగా, ఖంగారుగా ప్రశ్నించింది.

"కాస్తలో తప్పిందే తల్లీ ! నాకు అనుమానంగానే వుంది, ఈ విశాలినిచూస్తుంటే! అందుకే అక్కడే పడుకున్నా. కాస్త నిద్ర పట్టింది. తలుపు చప్పుడు అయితే మెలుకువ వచ్చి చూస్తే, ఇంకేముంది నూతి వైపుకి పరుగుతీసింది.. నేను వెళ్లి ఆపకపోతే నూతిలోపడి ప్రాణాలు తీసుకునేది" అంటూ తల్లి చెపుతూ శోకించ సాగింది.

హరితకి నోటమాట రాలేదు. స్థాణువులా అలా వుండిపోయింది. కళ్లనీరు గిర్రున తిరిగాయి. వదిన ఎంత సాహసానికి వడిగట్టింది ! హరిత తలలో ఆలోచనలు బొంగరంలా గిర్రున తిరగసాగాయి. అయోమయంగా, మతిపోయినట్టు అలా వుండిపోయింది.

యిరుగూ పొరుగూ గోవిందమ్మ శోకాలకి లేచివచ్చి, విషయం తెలుసుకుని సానుభూతి వ్యక్తపరిచి వెళ్లిపోయారు.

(ఇంకా వుంది)

# ఉత్తరాలు

## కథలు

నటి 'అంజలీనాయుడు' ముఖ చిత్రంతో వెలువడిన 3—10—80 నాటి ఆంధ్రపత్రికచూడ ముచ్చటగా ఉంది. మరువాడ రాజేశ్వరరావుగారి "తాతయ్య" పురి చెర్ల సుబ్బారావుగారి "చట్టానికి అటూ, ఇటూ" కథలు వెరైటీగా ఉండి, చాలా బావున్నాయి. సీరియల్స్ "మువ్వల మురళి" "ప్రేమతీర్థం" రెండూ చాలా ఇంటరెస్టుగా ముందుకు సాగిపోతున్నాయి. బులుసు వేంకట రమణయ్యగారి "ధర్మ పథం" చాలా ఆసక్తిదాయకంగా ఉంది. ఈ వారం కార్టూన్స్ మమ్మల్ని కడుపుబ్బ నవ్వించాయి.

కొమ్మినేనిప్రసాద్ (గుంటూరు)

* * *

'శారద' ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర పత్రికలోని కథలన్నీ బాగున్నాయి. ముఖ్యంగా పి. పద్మావతిగారి 'తల్లిదండ్రులూ జాగ్రత్త' కథ చాలా బాగున్నది. "ప్రేమతీర్థం" సీరియల్ ప్రారంభం నుండి బాగున్నది.

దామెర్ల లలితకుమారి (నెల్లూరు)

*

నటి శారద ముఖచిత్రం అత్యంతఆకర్షనీయుంగా ఉండి మమ్మల్ని విశేషంగా ఆకర్షించింది. ఇందులో ప్రచురించిన తల్లిదండ్రులూ జాగ్రత్త! శిశిర జీవితాలు కథలు చదువుతుంటే కవిత్వములో స్త్రీలు ఇంతముందంజ వేశారా!అని గర్విస్తున్నాను.

టి. వెంకటలక్ష్మి (పెద్దాపురం

* * *

12—9—80 నాటి పత్రికలోని 'అవగాహన కథ ఎన్నో రోజులకు వో మంచి కథ చదివిన అనభూతి కలిగించింది.

సి. రామమూర్తి (నెల్లూరు)

వినాయకచవితి సంచికలోని 'మరో ఇల్లువద్దు కథ చదివాక మంచి హాస్యకథ చదివానన్పించింది కథ ఇంకా కాస్త బిగువుగా అల్లి ఉంటే బాగా ఉండేది మొత్తంమీద సాదాగ కన్పించిన హాస్య కథ అని చెప్పవచ్చు.

'మువ్వల మురళి' ఇప్పటికి మలుపుకువచ్చిందనుకొంటాను. గేయాలు, కథలు ఎక్కువగా అందిస్తారని ఆశిస్తాను.

బద్వేలి రమేష్ ( అనంతపురం)

## సీరియల్

19—9—80 మా అభిమాన వారపత్రికలోని అన్ని కథలూ బాగున్నాయి. ఈవారముతో ప్రారంభమైన "ప్రేమతీర్థం" సీరియల్ చాలా ఆసక్తికరముగా ఉన్నది. రచయిత్రి శ్రీమతి కల్యాణి సోవరాజుకు మా ధన్యవాదములు. ఈవారం కార్టూన్స్ చాలా బాగున్నాయి. ముఖ్యంగా 22వ పేజీలో పండరినాద్‌గారి కార్టూన్ కడుపుబ్బ నవ్వించింది.

బార్లపూడి నాగేశ్వరరావు ( చీరాల)

* * *

3—10—80 సంచికలోని మువ్వల మురళి సీరియల్ నాకుచాల నిరుత్సాహకరంగా ఉంది. కృష్ణ సుమంత్‌పాత్ర నాకు నచ్చలేదు. రోజా అంటే అంత ఇష్టం చూపించేవాడు తల్లిదండ్రులను ఎదిరించి ఒక పేద పిల్లను ఉద్ధరించవచ్చు కదా? ప్రేమతీర్థం కథ ఇప్పటి వరకు బాగానే ఉంది. రచయిత్రిగార్కి నా కృతజ్ఞతలు.

జె. లక్ష్మి (కోరుకొండ)